## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam

Author

Year to

Subject: Any Subject

Language: Telugu

Scanning Centre: Any Centre

Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

బి.రామరాజు

కామగ్రంథమాల—౭ గ్రంథము.

# పంచసాయకము.

శ్రీ కవిశేఖర జ్యోతిరీశ్వరాచార్య విరచితము.

1960



చందాదారులకుమాత్రమే
వెల రు 2—0—0

శ్రీరస్తు.

# భూమిక.

శ్లో. సాధకవర్గసమీహిత-పూరణరసికా సదా ఒఒగమఖ్యాతా
శ్రీనగరస్థితపీఠా సతతం శ్రీకంసమర్ధినీ జయతి. (1)

శ్లో. ఆదరణీయాచారౌ చారువిచారౌ మహోదారౌ
ఆశ్రితశివోపచారౌ మాతాపితరౌ చిరం వందే. (2)

ఓ ప్రణయవాంఛాసమన్వితులైన రసికులారా! కామకలా రహస్య విజ్ఞానసమన్వితులగు గృహస్థులారా! ప్రపంచకములో నాలు గాశ్రమము లనగా బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ యత్యాశ్రమము లనఁబడు నాల్గింటిలో గృహస్థాశ్రమమును ధర్మార్థకామమోక్షము లను చతుర్విధపురుషార్థములలో కామపురుషార్థము ప్రధానమనియు సర్వోత్కృష్టమనియు మీర లెఱింగినదే.

ఈ పురుషార్థచతుష్టయమును తెలిసికొని జనులు ముముక్షువులై తరింపగల రను తలఁపుతో బ్రహ్మాదిసకలదేవతావంద్యులును తపోధనులు పండితప్రకాండులునైన వ్యాస వశిష్ఠ జైమిని గౌతమ కణాద నారద మను శుక్ర వాత్స్యాయనాదిమహామునులు మను స్మృతి మొదలుగాగల ధర్మశాస్త్రములను శుక్రనీతివంటి నైతిక రాజకీయార్థ తత్త్వబోధకములగు శాస్త్రములును దైవతత్త్వమును తెలిసికొని శాశ్వతముక్తిని గాంచుటకై పారమార్థిక గ్రంథరాజములను రచించియుండిరి.

ఏవిధముగ ధర్మార్థమోక్షములు మహర్షిప్రోక్తములై శాస్త్ర సమ్మతములై యొప్పుచున్నవో నదేవిధముగ మూఁడవదగు కామ పురుషార్థముకూడ శాస్త్రసమ్మతమై మహాత్ములచే నంగీకృతమై యొప్పుచున్నది. ఈ కామప్రబోధకమగు శాస్త్రమునే కామశాస్త్ర మను పేరుతో పెక్కుమంది పండితులు పెక్కుగ్రంథములు వ్రాసి యున్నారు.

నందిప్రముఖ శ్వేతకేతు బాభ్రవ్య దత్తక సువర్ణనాభ ఘోటకముఖ గోనర్దీయ గోణికాపుత్ర కొక్కోక కూచిమార వీరభద్ర రంతిదేవ జయదేవ కవిశేఖరాచార్య చారాయణ బాదరాయణులు మొదలుగాగల వారలీ కామశాస్త్రమునకు గ్రంథకర్తలై యున్నారు.

కామసూత్రములు కందర్పచూడామణి కామరత్నము రతిరహస్యము నాగరసర్వస్వము రసికసర్వస్వము, మన్మథసంహిత, అనంగరంగము, రతిమంజరి, పంచసాయకము, లోనుగాఁగల పెక్కు గ్రంథములు కామశాస్త్రనియమ ప్రతిపాదకములై కానవచ్చుచున్నవి. వీనిలో కొన్ని పుస్తకములు నేఁటికిని లోకంబునఁగలవు. కామశాస్త్రనియమములనుగురించి సంగ్రహముగ బోధించునట్టి యీ పంచసాయకమను గ్రంథముకూడ వానిలో నొకటి.

మర్గమమైన కామాగమరహస్య మీగ్రంథమందు సరళములైన నిర్మలములైన శ్లోకములచేత విశదీకరింపబడియున్నది. శ్రీకంఠార్చనపరాయణుఁడును సంగీతాగమజ్ఞానరచనాచాతుర్యచింతామణియుఁ గవిశేఖరపదలాంఛితుఁడు నగు జ్యోతిరీశ్వరాచార్యుఁ డను కవిపుంగవుఁ డీగ్రంథమును రచించియున్నాఁడు. ఇందుల కీగ్రంథకర్త స్వయముగ రచించిన యీక్రింది శ్లోకమే ప్రమాణము.

శ్లో. అస్తి ప్రత్యహమర్థితాపహరణే ప్రీత్యైకదీక్షాగురుః
శ్రీకంఠార్చనతత్పరో భువి చతుష్షష్ఠేః కలానాం నిధిః
సంగీతాగమసత్ప్రమేయరచనాచాతుర్యచింతామణిః
ప్రఖ్యాతః కవిశేఖరార్చితపదః శ్రీజ్యోతిరీశః కృతీ.

గ్రంథకర్త యీపొత్తము నైదుసాయకములతో ముగించెను.

ప్రథమసాయకములో నాయకలక్షణమును నలినీ మొదలగు నాలుగుజాతుల స్త్రీభేదములును, వారిలక్షణములను స్త్రీల కుడి యెడమభాగములందు శుక్లకృష్ణ పక్షములలో పాడ్యమిమొదలు తిథిక్రమముగా కామకళయొక్క యారోహణావరోహణములును, ఆయా అంగప్రత్యాలింగనములచేత కాంతలకు స్ఖలనము, నళినీ మొదలగు స్త్రీలకు తిదిభేదములచేత ద్రావణోపాయములును, వారితో

సురతసుఖము ననుభవించుటకు తగినకాలము, మొదలుగాగల విష యములుకలవు.

రెండవసాయకములో శశాదిపురుషభేదములు వారి లక్షణ ములు మృగ్యాదిస్త్రీభేదములు సమసురతభేదములు మూఁడు, విషమ సురతభేదము లారును, ప్రచండాది భేదములు మూఁడు, ఆయాదేశ స్త్రీల లక్షణమును స్వరూపమును, పంకజాదిసాదృశ్యమువలన నాలుగు విధములగు వరాంగభేదములు వాని ప్రాశస్త్యము ప్రీతిభేదములు నిరూపింపఁబడినవి.

మూఁడవసాయకములో నాయా యంగప్రత్యంగ దౌర్గంధ్య హారములగు నౌషధప్రయోగములు పెక్కులు సర్వాంగసౌరభకరము లగు స్నానచూర్ణములు, సామాన్యములు విశేషములునగు నంగ రాగములు ముఖవాసనను కలుగజేయు వివిధప్రయోగములును వాజీ కరణార్థములగు దివ్యౌషధ చూర్ణ రసాదిప్రయోగములు యోని గాఢీకరణోపాయములు సింధూరాది ప్రలేపాదులు వనితాద్రావణో పాయములు ధ్వజదార్ఢ్యవృద్ధికరములగు నుపదేశములు వీర్యస్తంభ నోపాయములు స్త్రీపురుష వశీకరణోపాయము అభీష్టసిద్ధి ప్రదము లగు చాముండాదిమంత్రములు నలిన్యాది స్త్రీలవశీకరణమంత్రము లును యోని సౌభాగ్యకరములగు ధూపాదిప్రయోగములును గర్భ ధారణోపాయములు బాగుగా నిరూపింపఁబడినవి.

నాల్గవసాయకములో కన్యకలవరణము వారల గుణదోష ములు వరులగుణదోషములు ఎనిమిది విధములగు వివాహములు వానిలక్షణములు దౌత్యకర్మోచితలగు స్త్రీలు సుఖసాధ్యలు కష్ట సాధ్యలగు స్త్రీల లక్షణములు సురతమున కయోగ్యలగు స్త్రీల లక్ష ణము, రతి కుచితా నుచితస్థానములు, ఆలింగన చుంబన భేదములు, నఖ దంతక్షత స్థానములు వాని వివరములును లెస్సగా నిర్వచింపఁ బడినవి.

అయిదవసాయకములోఁ గామాతపత్రము తత్ప్రదేశమం దుండు నాడులు వాని లక్షణము కరణప్రకరణ (బంధములు) మంద

వశ్యముగాఁ దెలిసికొనఁదగిన విశేషములు నాగరా ద్యుత్తాన బంధ భేదములు. ఉపవీతకాది పార్శ్వబంధప్రకారములు, పద్మాసనా ద్యుపవిష్ట బంధప్రయోగములు, హరిణాదులకు నధోబంధప్రకరణము, విపరీతబంధ వివరములు. ఆబంధములకు యోగ్యలుగాని స్త్రీలు, ఆనందోదయ వ్యంజకంబులగు చిహ్నములు, స్వాధీనపతికా ద్యష్ట నాయికాభేదములు మొదలైన యత్యావశ్యక విషయము లాయ సము లేకుండ సులువుగ గ్రహింపఁదగినట్లు ప్రతిపాదింపఁబడినవి. ఈగ్రంథము కామసూత్రాదులకంటె కఠినంగదు సులభముగా గానగును.

ఈ కామశాస్త్రము గృహస్థాశ్రమమునందలి దాంపత్యానుభవానందరసము నాస్వాదింపఁ గోరుచున్నట్టియు కామకలావిజ్ఞానము నామూలాగ్రముగఁ దెలిసికొన గోరుచున్న యుత్తమపురుషులచేఁ బఠింపఁ దగినది.

ఇందుంగూర్చి యొక కవికులతిలకు డిట్లు వ్రాసియున్నాఁడు.

శ్లో. దాంపత్యసుఖసిధ్యర్థం కామశాస్త్రం సమభ్యసేత్
తదభ్యాసాదనిర్వాచ్య మమందానందమశ్నుతే.

శ్లో. కామశాస్త్రవిహీనానాం రతిః పాశవికీ మతా
తదభ్యాసాన్న సౌఖ్యం స్యాత్ కేవలం దుఃఖ మాప్నుయాత్.

తా. దాంపత్యసుఖమును పొందఁదలఁచిన పురుషులు తప్పక కామశాస్త్రము నభ్యసింపవలయును. అందువలన ననిర్వాచ్యమైన యానందము ననుభవింపగలరు. కామశాస్త్రజ్ఞాన విహీనులరతి పశురతమనఁబడును. అట్టి పశురతప్రయోగమువలన సుఖముకలుగదు. దుఃఖమే సంభవించును.

మఱియు

శ్లో. సంసారే తు ధరాసారం ధరాయాం నగరం మతం
ఆగారం నగరే తత్ర సారం సారంగలోచనా.

శ్లో. సారంగలోచనాయాంచ సురతం సారముచ్యతే
నాతః పరతరం సారం విద్యతే సుఖదం నృణాం.

శ్లో. సారభూతంతు సర్వేషాం పరమానందసోదరం
సురతం యే న సేవన్తే తేషాం జన్మైవ నిష్ఫలం.

తా. ప్రపంచకమున భూమియే సారమైనది. ఆభూమియందు సారమైనది నగరము. నగరములో శ్రేష్ఠమైనది భవనము. భవనమున కలంకారభూతమైనది కాంత. స్త్రీయందలి సారము సురతసుఖము. కావున నింతకన్న శ్రేష్ఠమైనది వేరులేదు. సర్వప్రాణులకు సారభూతమై పరమానందమునిచ్చునది సురతము. దానిని సేవింపనివారిజన్మ నిష్ఫలము.

ఈ యభిప్రాయమునందలి ప్రాశస్త్యమునుగురించి వేదసారములైన యుపనిషత్తులలో నొకటియగు బృహదారణ్యకోపనిషత్తునందిట్లు చెప్పఁబడియున్నది.

శ్రు. తద్యథా ప్రియయా స్త్రియా సంపరిష్వక్తో
న బాహ్యం వేద నాంతరమేవమేవాయం పు
రుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న
బాహ్యంకించన వేద నాంతరం ”

ఈ శ్రుతియం దుపమేయభూతమైన బ్రహ్మానందమునకు ప్రియతమా విషయకానందమే యుపమానముగాఁ జేయబడినది. ఇంతేగాక

శ్లో. కీదృశీ గృహిణీ యోగ్యా గృహిణాం భవతి ధ్రువం
కథం కి ముపదేష్టవ్యా తత్తత్కర్మప్రసాధనే.

శ్లో. గృహకర్మాణి తూర్ణంచ ప్రావీణ్యం వృణుయాత్కథం
కథం ఖల్వతివేలం సా సౌశీల్య మనుశీలయేత్.

శ్లో. వ్యాపారేణ చ కేనేహ తూర్ణం వీణావిరాగిణీ
తరుణీ రమణీ వాపి భవేత్పూర్ణానురాగిణీ.

శ్లో. అనంగరంగప్రతిమాం దయితాం హృదయంగమాం
సమాసాద్య నిరాయాసం కథంవా హ్యనుకూలయేత్.

శ్లో. దృగ్విదగ్ధమనోజస్య యాసాం దృగ్జీవితప్రదా
తా వామలోచనాశ్చాత్ర పర్యాలోచ్యాః కథం బుధైః.

శ్లో. ఇత్యాదికం పరిజ్ఞేయం సర్వభూతసుఖప్రదం
రతిశాస్త్రేణ విజ్ఞాయ శాశ్వతం సుఖమశ్నుతే.

అని వ్రాయంబడిన శ్లోకప్రమాణమునకనుసరించి గృహస్థున కెట్టిగృహిణి యోగ్యయగును? ఆయాక్రియాకలాపమును సాధించుట యందేయేవిధులుపదేశింపఁబడినవి? ఎట్టిస్త్రీ వివాహయోగ్యయగును? వివాహమాడిన సుందరియందు తనప్రేమ నెట్లు వృద్ధినందింపవల యును? ఏవిధముగ నాస్త్రీ హృదయమును తనయధీనము చేసికొన వలయును? గార్హస్థ్యసుఖమన నెట్టిది? ఆసుఖమునుపొందుట కుపాయ మేమి? ఈ మొదలగు విషయములను తెలిసికొనవలయునన్న కామ శాస్త్ర పరిజ్ఞాన మావశ్యకమని చెప్పఁబడియున్నది. ఇంతియేగాక దాంపత్యసుఖమునుగూర్చి యొకకవిపుంగవు డిట్లు వ్రాసియున్నాఁడు.

శ్లో. కిం దాంపత్యసుఖం లోకే కాని తత్సాధనాని చ
కుమారీ పరిణీతా తు కీదృశీ సుఖదా భవేత్.

శ్లో. కే చ విస్రంభణోపాయా స్తాసామిహ సుఖావహాః
ప్రమదానాం కథంచాపి మదవిద్రావణం భవేత్.

శ్లో. కథం నష్టోఽనురాగశ్చ ప్రత్యానేయో మనీషిభిః
వంధ్యాయాం మృతవత్సాయాం వాత్మజాప్తిః కథం భవేత్.

శ్లో. సతీనాం వనితానాంచ లక్షణానీహ కాని చ
పుంశ్చలీనాంతు నారీణాం పరిజ్ఞానం కథం భవేత్.

శ్లో. తాసాం విచేష్టితేభ్యశ్చ హ్యాత్మానం రక్షయేత్కథం
కథం శరీరం సుగతాయాసితంతు విలాసినాం.
నవయౌవనకాలీన సురతక్షమతాం వ్రజేత్

శ్లో. ప్రౌఢావద్భిర్భిషగ్వర్యైః ప్రత్యహం సుపరీక్షితాః
గర్భసాధారణోపాయాః కే భవేయుః సుఖప్రదాః.

శ్లో. ఇత్యేవమాదయోఽవశ్యం జ్ఞాతవ్యా విషయాశ్చ యే
తానవిజ్ఞాయ మూఢాత్మా కథం రతిసుఖం లభేత్.

లోకమునందు దాంపత్యసుఖమనదెద్ది? దానికి సాధనములేవి? ఎట్టికుమారి పరిణయమునకు తగినది? ఎట్టి సుఖమునీయగలదు? ఆమెను స్వాధీనముచేసికొని సుఖించుట కుపాయము లెట్టివి? స్త్రీల నెట్లు శీఘ్రముగ ద్రవింపఁజేయవలయును? అనురాగములేనిస్త్రీ యందు ప్రీతియెట్లు పెంపొందింపనగును? గొడ్రాలియందుఁగాని బిడ్డలు పోయిన యువతియందుఁగాని సుతోత్పత్తిని గల్గించు మార్గమెట్లు? పతివ్రతల లక్షణము లెట్టివి? పుంశ్చలియగు స్త్రీని యేవిధముగ గుర్తింపనగును? గర్భధారణమునకు సుఖప్రసమున కేది యుపాయము ఈ విషయములను దెలిసికొనఁజాలని మూఢుఁడు రతిసుఖము నెట్లు పొందఁగలఁడు.

ఇంతేగాక మరియొకపండితుఁ డిట్లు వ్రాసియుండెను.

శ్లో. రతిశాస్త్రపరిజ్ఞానవిమూఢా యే నరాధమాః
రతిం స్వరతిహీనాయాం విధిత్సంతి గతాయుషః.

శ్లో. అవశ్యం మరణం తేషాం భవేదితి వినిశ్చితం
అతోఽపి రతిశాస్త్రస్య జ్ఞానమావశ్యకం మతం.

రతిశాస్త్రపరిజ్ఞానములేని మూఢులు గతాయుర్భావము కల వారై తమయం దాసక్తిలేని స్త్రీలయందు నసమర్థలైన స్త్రీలయందు రతిసల్పుదురు. దానఁజేసి మరణమును పొందుదురు? మఱియుఁ గామశాస్త్రజ్ఞానములేనిచో గార్హస్థ్యసుఖమునందు విరక్తి కలుగును. దాన మరణాద్యనిష్టములు గలుగుననుట సర్వులకు విదితమే. కావున రసికులైన గృహస్థులకు రతిశాస్త్రజ్ఞాన మావశ్యకము.

నవీనులైన కొందరు విద్వాంసు లీ రతిశాస్త్రమును, దుర్వ్యస నాది ప్రవృత్తికిఁ గారణమని నిందించుచుందురు. అది అవిచారవిజృంభితము. కామకలయందలి యథార్థానందానుభవులగు పండితులకది తెలియనిదికాదు. ఇందుఁగూర్చి యొకకవీంద్రుఁ డిట్లునుడివియున్నాడు.

శ్లో. పాశ్చాత్యసభ్యతాక్రూరరాక్షసావేశమోహితాః
రతిశాస్త్రరహస్యాంత - పరిజ్ఞానవివర్జితాః.

శ్లో. సత్యపరిచారకమ్మన్యా విద్వాంసో యే హతాశయాః
దుర్విచార - దురాచార - వ్యభిచార - ప్రచారకం.

శ్లో. అశ్లీలబహులాధారం త్వధర్మస్య ప్రసారకం
కామశాస్త్రంతు మన్యంతే నిర్దోషమపి సర్వథా.

శ్లో. నితాంతం గోపనీయాశ్చ శాస్త్రమేతదతః స్మృతం
అతః కామాగమగ్రంథాః సంగ్రాహ్యా నైవ కర్హిచిత్.

శ్లో. న శ్రోతవ్యా న ద్రష్టవ్యా నాధ్యేతవ్యాః కథంచన
ఇత్యేవం యత్పరిజల్పంతి మూర్ఖప్రలపితంతు తత్.

పాశ్చాత్య సభ్యతయను క్రూరరాక్షసుని యావేశముచే మోహితులై లోకములో మనుజులు రతిశాస్త్రపరిజ్ఞాన విహీనులై కామాగమము ధర్మవిరుద్ధమనియు పారదారికాధికారిక రతిప్రవృత్తిని బోధించుటఁజేసి నీతిబాహ్యమై దుర్విచార దురాచార వ్యభిచారములను పేరేపించుచున్నదని తలంచి తిరస్కరించుచున్నారు. అది యంతయు నీ శాస్త్రమభ్యసింపకపోవుటవలన కలిగినదిగాని వేరుకాదు. విమర్శకులైనవారు రతిశాస్త్రమునకు సంబంధించిన గ్రంథజాలమును యథార్థచిత్తవృత్తితోఁ బరిశీలించినయెడల నీశాస్త్రము సర్వజన పఠనయోగ్యమను, నభిప్రాయము స్ఫుటముకాఁగలదు.

ఈ పారదారికాధికార ప్రకరణముంగూర్చి పూర్వపు కామ శాస్త్రగ్రంథకర్తలందరు గర్హణీయత్వమునే లెస్సగా ప్రతిపాదించి యున్నారు. పాఠకులైన తమకు నమ్మకము గల్గుటకై యిచ్చట దిఙ్మాత్రముగా నుదహరించుచున్నాము.

ఇందుంగూర్చి కవిశేఖరాచార్యులిట్లు నుడివెను.

శ్లో. అశ్రద్ధా ముపహాస్యతాం మలినతా మర్థక్షయం లాఘవం
గర్హాం గ్లాని మధోగతిం వికలతా మాయుఃక్షయం దుర్గతిం

ఇత్థం య పరదారకర్మణిరతో లోకత్రయే నిందితాం
విందంతే పరమాపదః సుఖధియా దుఃఖం నరాస్తే సదా.

4 వ సాయకం 16 వ శ్లోకము.

ఏ పురుషుఁడు పరదారయందు దానసక్తికలవాఁడగునో వాఁడు అశ్రద్ధను పరిహాసమును మలినత్వమును ధనక్షయమును లాఘవమును గర్వ్యాతయును, అధోగతిని ,విఫలత్వమును, ఆయుఃక్షయమును, దుర్గతిని బొందును. కావున పరదారరతి నింద్యము.

కొక్కోకకవీంద్రుఁ డిట్లనుడివియున్నాఁడు.

శ్లో. అసంగృహీతభార్యాంచ బ్రహ్మస్త్రీం యశ్చగచ్ఛతి
సూతకం సతతం తస్య బ్రహ్మహత్యా దినే దినే.

మఱియు

శ్లో. అజ్ఞాతా ద్విజవల్లభా గురువధూ మిత్రాంగనా రోగిణీ
చేటీ ప్రవ్రజితా సతీ రిపువధూ శిష్యా చ గర్భాన్వితా
భ్రూణఘ్నీ మృతసంతతిః ఖలజనా చాస్పృశ్యజా గోత్రజా
గంతవ్యా న కదాపి తత్రపురుషైరేతాః స్త్రియః కామిభిః.

పరదారగమనముచేసినవారికి బ్రహ్మహత్యకలుగును. సూతకము సంభవించును. పైన వ్రాయఁబడినరీతిని బ్రాహ్మణ గురు మిత్రాంగనా సంగమమును రోగిణి చేటి మొదలగు యువతుల సంపర్కమును నింద్యములని నిషేధించుచుండ నీశాస్త్రమువలన వ్యభిచారప్రచారకత్వమెట్లుకలుగుచున్నదో పాఠకులే నిర్ణయింపవలయును.

మఱియుఁ గామశాస్త్రమం దాయాస్థలములందు ధర్మశాస్త్రమార్గ మెట్లుప్రదర్శింపబడెనో యట్లే యాయుర్వేదాంతర్గమైన నియమావళియు నేతచ్ఛాస్త్రమున సూచింపఁబడినది. ఎట్లనగా!

శ్లో. గర్భిణీరమణేనేహ గర్భనాశోఽధవా ధ్రువం
గర్భపీడా ప్రజాయేత తస్మాత్తాం పరివర్జయేత్.

అపిచ

శ్లో. రోగిణీం రమణీం యస్తు సేవతే నష్టమానసః
బలక్షయో భవేత్తస్య వ్యాధిభిః స ప్రపీడ్యతే.

గర్భిణి రోగిణులను సంగమించిన గర్భనాశనము బలక్షయము-వ్యాధిసంభవించునని చెప్పబడినది.

అపిచ

నద్యాం దేవగృహే చతుష్పథవటే శైలస్య సానౌ జలే.

5 వ సాయకం — 25 వ శ్లోకం.

నదియందు దేవాలయమునందు- నాల్గుత్రోవలుగలసినచోట నున్న మఱ్ఱివృక్షముక్రింద పర్వతసానువులక్రింద జలములయందు సురతము నిషేధింపబడినది.

ఈవిధముగ నాయుర్వేదోపదేశానుసరణ మీశాస్త్రమునకు గలదనుట విస్పష్టము.

ఈ యాయుర్వేదోపదేశవిరుద్ధములైన కారణములు దేహశైథిల్యాదులను గలుగజేయునని చెప్పబడెను. విలాసవంతులైన పురుషులు తాముసాధింపఁదలఁచిన స్త్రీలయొక్క-యుఁ దమయొక్క-యు ప్రకృతి- తత్త్వము- స్వభావము- మదనాతపత్రము- కాలము- మొదలగువిషయములను గమనించి కామకలాకలాపమునకుఁ గడంగిన-చో దోషకరముకాదని కరణప్రకరణ ప్రారంభమందే చెప్పఁబడినది.

మఱియు

శ్లో. యో భార్యాయామృతౌ మోహాదంగనేవ ప్రవర్తతే
తస్య స్త్రీచేష్టితాకారో జాయతే షండసంజ్ఞితః.

శ్లో. ఋతౌ పురుషవద్వాపి ప్రవర్తేతాంగనా యది
తతః కన్యా యది భవేత్ సా భవేన్నరచేష్టితా.

సుశ్రుతం - సూత్రస్థానం 2 వ అధ్యాయం.

ఎవఁడు భార్యయందు ఋతుకాలమున మోహాముతో స్త్రీవలె ప్రవర్తించునో వానికి స్త్రీచేష్టితాకారుఁడైన నపుంసకుఁడు అనఁగా షండుఁడుజన్మించును. మఱియు నేయువతి ఋతుకాలమున పురుషునితో సంగమించునప్పుడు పురుషునివలె ప్రవర్తించునో నాసమయమున కన్యకజనించినయెడల పురుషచేష్టలుకలదగును.

ఈవిధముగ నాయుర్వేదశాస్త్రకారులగు మహర్షులచేత విపరీతరతము షండత్వాదిదోషకారణమై హేయమని ప్రతిపాదింపబడినది.

ఇంతేగాక విపరీతరతమునకుఁ బనికిరాని స్త్రీలనుగూర్చి యిట్లు వక్కాణించియున్నారు.

శ్లో. అల్పప్రయుక్తా ఋతుయోగయుక్తా
గర్భాలసా స్థూలతనుర్నతాంగీ
క్షీణా నవోఢా జ్వరితా చ నారీ వర్జ్యా
రతిజ్ఞైర్విపరీతబంధే.

ఋతుమతి-గర్భవతి-స్థూలాంగి- వంగినశరీరముగలది- శుష్కించినది- నవోఢ- జ్వరపీడిత- ఈ స్త్రీలు విపరీతరతమున కనర్హలు. అని నిషేధించుటవలన విపరీతరతము కూడదని స్పష్టమైనదిగదా! అట్టిచో నీశాస్త్రమెట్లు గర్హ్యమైనది?

కామశాస్త్ర మశ్లీలములతోఁ గూడియుండుటచేఁ బరిత్యాగార్హమని తలంచు మూఢులీక్రిందిశ్లోకములను బరిశీలింపవలయును.

శ్లో. లలితా పరిణీతా తు వనితా సా ప్రకాశ్యతే
దాంపత్యసుధపీయూషసందోహం యా ప్రవాహయేత్.

శ్లో. కుటీరమపి దీనానాం యయా చ సమలంకృతం
ఇంద్రమందిరసౌందర్యమహిమానం విడంబయేత్.

శ్లో. ప్రశస్తా చ రతిః సైవ యయా తు హృదయస్థయా
స్వాంతే నితాంతం శాంతిస్స్యాల్లోకద్వయసుఖావహా.

శ్లో. విషయాంభోధికల్లోలాద్యా చ జీవనపాదపం
విశీర్ణమూలం ఝటితి సరసం పరికల్పయేత్.

శ్లో. లోకం ధర్మార్థకామాని రాజనీతించ ప్రత్యయం
సమాలోక్య ప్రవర్తేత సంయతో దారసంగ్రహే.

శ్లో. రతిశాస్త్రరహస్యజ్ఞః పురుషార్థత్రియస్థితిం
పాలయన్విధివద్యుక్తః సుఖమక్షయమశ్నుతే.

ఏయువతి దాంపత్యసుఖామృతప్రవాహమును ప్రవహింపఁజేయునో నట్టి కాంతను పరిణయమాడవలయును.

ఏకాంత దీనునికుటీరమునైనను దేవేంద్రమందిరమువలె దీపింపజేయునో నట్టిస్త్రీని బెండ్లాడవలయును.

తనహృదయమును స్థానముగాఁజేసికొనఁజాలిన కామినిని పరిణయమాడి యామెతో రతిక్రీడల ననుభవించినచో నయ్యది ప్రశస్తమై యెల్లప్పుడు మనస్సునకు శాంతినొసఁగి యిహపరలోకములలో సుఖదాయకమగును. ఇవ్విధంబుగ సర్వలోకంబులకు నుపకారకరమైన యీశాస్త్రము ధర్మార్థకామములకు రాజనీతికి నుపదేశమగుటచే దీని నధ్యయనముఁ గావించినవాఁడు మోహమగ్నుఁడై స్వేచ్ఛాప్రవర్తకుఁడు కానేరడు. అధికముగాఁ జెప్పుటవలన నేమియు లాభము లేదు. లోకమందు రతిశాస్త్రము సర్వజనసుఖకరమై ఇహపరముల కత్యంతోపయోగకారియై యుండుననుట నిర్వివాదాంశము. దీనియొక్క ప్రాశస్త్యమునుగూర్చి పూర్వాచార్యులైన వాత్స్యాయనాది మహర్షులు బహువిధములుగఁ జెప్పియున్నారు. ఇట్టి మహోత్కృష్టమైన తృతీయపురుషార్థప్రబోధకమగు కామశాస్త్రవిషయమును సంక్షేపముగా నుపదేశించిన యీపంచసాయకమను గ్రంథము మిక్కిలి లోకోపకారమనియు సర్వజనసమాదరణీయమనియుఁ గోవిదబృందము (పండితజనులు) తలంతురుగాక.

20_8_23,
పుదుచ్చేరి.

విద్వద్విధేయుడు,
యస్. చిన్నయ్య.

# ఇంతకుముంధు ప్రకటింపబడిన గ్రంథములు.

కామగ్రంథమాల:- ౧ వ గ్రంథము.

## ర తి ర హ స్య ము

లేక

## కొక్కోకము (అను) కళాశాస్త్రము,

[రెండవకూర్పు]

తెలుఁగుభాషలో నిట్టిగ్రంథ మింతవరకును బ్రకటింపఁబడి యుండలేదు. కొక్కోక పండితుఁడు సంస్కృతమున రచియించిన రతి రహస్యము, ఎల్లన పద్యానువాదము, విపులమగు తాత్పర్యము సమ గ్రముగా, సర్వాంగసుందరముగా, బంధభేదముల చిత్రములతో ముద్రితమైన గ్రంథ మిదియొకకొటియే !

పూర్వము పోష్టు ఖర్చులుసహా రు. 12-0-0

ఇప్పుడు తగ్గింపుధర రు. 6-0-0, పోస్టేజి రు 0-8-0.

కామగ్రంథమాల:- ౨ వ గ్రంథము.

## చ ం ద్ర రే ఖా వి లా ప ము.

కూచిమంచి జగ్గకవి ప్రణీతంబగు

## హా స్య ర స ప్ర బ ం ధ రా జ ము.

ఆంధ్రదేశమునందుగల పెక్కు వ్రాఁతప్రతులతో సంప్రదించి కవివ్రాసినగ్రంథ మియ్యదియేనని నిర్ధారణ మొనర్చిన ప్రబంధరాజము.

వెల రు. 1-4-0 లు, పోస్టేజి రు. 0-4-0 లు.

కామగ్రంథమాల:- 3 వ గ్రంథము.

## కా ళి దా స ప్ర హ స న మ్.

సంస్కృతమున మహాకవి కాళిదాస విరచితమగు ప్రహసన మొకటైపునను శ్రీయుత చివుకుల సత్యనారాయణశాస్త్రిగారిచే ఆంధ్రీకరింపఁబడిన యాంధ్రానువాదంబగు లంబోదరప్రహసన మొక టైపునను ముద్రింపఁబడిన హాస్యరస ప్రహసనరాజము.

వెల రు. 1-0-0, పోస్టేజి రు. 0-4-0 లు.

కామగ్రంథమాల:- ౪ వ గ్రంథము.

## శృంగార పంచకము.

మ॥ రా॥ శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారిచే రచింపఁబడిన జాబులు రెండుభాగములును, సరసోక్తియుక్త కృష్ణశతకమును, సరస చాటువులును కవిసార్వభౌమ శ్రీనాథకృతమగు రసికాభిలాషమును, పూర్వకవులచాటువులు నిందుగలవు. 416 పద్యములుగల 112 పుటల పొత్తము. వెల రు. 1-0-0, పోస్టేజి రు. 0-4-0 లు.

కామగ్రంథమాల:- ౫ వ గ్రంథము.

## రతిరత్న ప్రదీపిక.

మైసూరు ప్రభువగు ప్రౌఢదేవరాయలు రచించిన రతిశాస్త్రము:
సంస్కృతమూలము, ఆంధ్రవివరణము.

ఇతర కామశాస్త్ర గ్రంథములందు జెప్పఁబడని ఔపరిష్టకవిధానములిందు వివరింపఁబడినవి. బంధభేదముల నిరూపించు పాశ్చాత్య ఛాయాచిత్రములు జేర్పఁబడినవి. అత్యుత్తమమగు కామకళానిబంధనము, అనుబంధముగా దత్తాత్రేయతంత్రముతో యోగిపుంగవుఁడగు దత్తాత్రేయునిచే ననుగ్రహింపఁబడినది. వాజీకరణ, స్త్రీవశ్యవిధానములకిం దనేక అనుభవయోగములుగలవు. ప్రత్యక్ష ఫలమిచ్చు, రసికజనోపకారియగు గ్రంథము.

గ్లేజు ప్రతి వెల రు. 2-0-0 లు
రఫ్ ప్రతి వెల రు. 1-0-0 లు
} పోస్టేజి రు. 0-4-0 లు.

కామగ్రంథమాల:- ౬ వ గ్రంథము.

## బ్రహ్మానందము.

ఇందు బ్రహ్మానందశతకము- గోపీనాథ వేంకటకవి. 2. రామావధూటితారావళి- మాడభూషి వేంకటాచార్యుఁడు. 3. గణపతీయము- ప్రాచీనకవి. 4. శప్పవిజయము- తెనాలి రామకృష్ణుఁడు. 5. శృంగారశతకము- తోఁట విజయరాఘవకవి. ఈ 5 గ్రంథములును గలవు.

వెల రు 1-4-0 లు, పోస్టేజి రు 0-4-0 లు.

చిత్రిణికి చంద్రకళా ప్రదీపనము.

—♦ దశమి ♦—

శ్లో. చుంబిత్వాలక ముచ్చదః కరరుహై రాలిఖ్య వక్షోజకం
శ్రోణీ పృష్ఠ [1]భుజాంఘ్రి కర్ణ జఘన స్థానోరు యుగ్మస్థలీం
పాణిభ్యా ముపగూహయన్ స్వరమణీం కాంతో దశమ్యాం తిథౌ
కందర్పం ప్రతిబోధ్య చంద్రికలయా [2]కుర్యా న్నిజాం చిత్రిణీం.

తా. దశమినాడు ప్రియుడు తనప్రియురాలైన చిత్రిణి ముంగురులను ముద్దిడుకొనుచు, వక్షోజములకడ నఖక్షతమొనర్చి, కటి ప్రదేశము—వీపు—భుజములు—పాదములు—చెవులు—కటిప్రదేశమునకు పైభాగమును చేతులతో చక్కగాస్పృశించి మర్దించుచు చంద్రికళా ప్రదీపనమొనర్చి మన్మథుని మేల్కొల్పవలయును.

—♦ షష్ఠి ♦—

శ్లో. శ్లిష్ట్వా కందరకందలీం భుజలతా పాశేన [3]గాఢం పునః
పాయంపాయ మజస్ర [4]ముత్పలదృశాం వక్త్రారవిందాసవం
నాభీ కంఠ నితంబ [5]బింబ నఖరవ్యాపార పారంగమైః
షష్ఠ్యాం చంద్రికలాకలాప నిపుణై ర్దేయా నఖాః సర్వతః. 20

తా. షష్ఠ తిథియందు కాముకుడు ప్రియురాలైన చిత్రిణి యొక్క భుజములను తనభుజములతో కౌగలించుకొని, చేతులతో చక్కగా మర్దించుచు, నల్లకలువరేకులవంటి నేత్రములుగల ప్రియురాలి యధరమును మాటిమాటికి గ్రోలుచు, నాభి-కంఠము-పిరుదు-అధరములయందు నఖక్షతముచేయుటలో సమర్థుడై చంద్రికళాప్రదీపనము కలుగజేయవలయును. అనగా కళావిదుడగు నాయకుడు షష్ఠినాడు సర్వదానఖక్షతముల నొనర్చి చిత్రిణిని రంజింప జేయ వలయును.

---

పా. 1. (ఎ) భుజాతికర్ణ. పా. (బి) భుజాస్యకర్ణ, పా. 2. కుర్యార్నిజాం, పా. 3. గాఢంతతః, పా. 4. సంగమలయ వ్యాపార, పా. 5. ముత్పలదశాం.

శ్లో. పాశ్చాత్యసభ్యతాక్రూర రాక్షసావేశమోహితాః
రతిశాస్త్రరహస్యాంత - పరిజ్ఞానవివర్జితాః.

శ్లో. సత్యప్రచారకమ్మన్యా విద్వాంసో యే హతాశయాః
దుర్విచార - దురాచార - వ్యభిచార - ప్రచారకం.

శ్లో. అశ్లీలబహులాధారం త్వధర్మస్య ప్రసారకం
కామశాస్త్రంతు మన్యంతే నిర్దోషమపి సర్వథా.

శ్లో. నితాంతం గోపనీయాశ్చ శాస్త్రమేతదతః స్మృతం
అతః కామాగమగ్రంథాః సంగ్రాహ్యా నైవ కర్హిచిత్.

శ్లో. న శ్రోతవ్యా న ద్రష్టవ్యా నాధ్యేతవ్యాః కథంచన
ఇత్యేవం యత్ప్రజల్పంతి మూర్ఖప్రలపితంతు తత్.

పాశ్చాత్య సభ్యతయను క్రూరరాక్షసుని యావేశముచే మోహితులై లోకములో మనుజులు రతిశాస్త్రపరిజ్ఞాన విహీనులై కామాగమము ధర్మవిరుద్ధమనియు పారదారికాధికారిక రతిప్రవృత్తిని బోధించుటఁజేసి నీతిబాహ్యమై దుర్విచార దురాచార వ్యభిచారములను ప్రేరేపించుచున్నదని తలంచి తిరస్కరించుచున్నారు. అదియంతయు నీ శాస్త్రమభ్యసింపకపోవుటవలన కలిగినదిగాని వేరుకాదు. విమర్శకులైనవారు రతిశాస్త్రమునకు సంబంధించిన గ్రంథజాలమును యథార్థచిత్తవృత్తితోఁ బరిశీలించినయెడల నీశాస్త్రము సర్వజన పఠనయోగ్యమను, నభిప్రాయము స్ఫుటముకాఁగలదు.

ఈ పారదారికాధికార ప్రకరణముంగూర్చి పూర్వపు కామశాస్త్రగ్రంథకర్తలందరు గర్హణీయత్వమునే లెస్సగా ప్రతిపాదించియున్నారు. పాఠకులైన తమకు నమ్మకము గల్గుటకై యిచ్చట దిఙ్మాత్రముగా నుదహరించుచున్నాము.

ఇందుంగూర్చి కవిశేఖరాచార్యులిట్లు నుడివెను.

శ్లో. అశ్రద్ధా ముపహాస్యతాం మలినతా మర్థక్షయం లాఘవం
గర్హాం గ్లాని మధోగతిం వికలతా మాయుఃక్షయం దుర్గతిం

ఇద్థం య పరదారకర్మణిరతో లోకత్రియే నిందితాం
విందంతే పరమాపదః సుఖధియా దుఃఖం నరాస్తే సదా.

4 వ సాయకం 16 వ శ్లోకము.

ఏ పురుషుఁడు పరదారయందు దాసక్తికలవాఁడగునో వాఁడు అశ్రద్ధను పరిహాసమును మలినత్వమును ధనక్షయమును లాఘవమును గర్హ్యతయును, అధోగతిని, విఫలత్వమును, ఆయుఃక్షయమును, దుర్గతిని బొందును. కావున పరదారరతి నింద్యము.

కొక్కోకకవీందుఁడిట్లనుడివియున్నాఁడు.

శ్లో. అసంగృహీతభార్యాంచ బ్రహ్మస్త్రీం యశ్చగచ్ఛతి
సూతకం సతతం తస్య బ్రహ్మహత్యా దినే దినే.

మఱియు

శ్లో. అజ్ఞాతా ద్విజవల్లభా గురువధూ మిత్రాంగనా రోగిణీ
చేటీ ప్రవ్రజితా సతీ రిపువధూ శిష్యా చ గర్భాన్వితా
భ్రూణఘ్నీ మృతసంతతిః ఖలజనా చాస్పృశ్యజా గోత్రజా
గంతవ్యా న కదాపి తత్రపురుషైరేతాః స్త్రియః కామిభిః.

పరదారగమనముచేసినవారికి బ్రహ్మహత్యకలుగును. సూతకము సంభవించును. పైన వ్రాయఁబడినరీతిని బ్రాహ్మణ గురు మిత్రాంగనా సంగమమును రోగిణి చేటి మొదలగు యువతుల సంపర్కమును నింద్యములని నిషేధించుచుండ నీశాస్త్రమువలన వ్యభిచారప్రచారకత్వమెట్లుకలుగుచున్నదో పాఠకులే నిర్ణయింపవలయును.

మఱియుఁ గామశాస్త్రమం దాయాస్థలములందు ధర్మశాస్త్రమార్గ మెట్లుప్రదర్శింపబడెనో యట్లే యాయుర్వేదాంతర్గమైన నియమావళియు నేతచ్ఛాస్త్రమున సూచింపఁబడినది. ఎట్లనగా!

శ్లో. గర్భిణీరమణేనేహ గర్భనాశోఽభవా ధృవం
గర్భపీడా ప్రజాయేత తస్మాత్తాం పరివర్జయేత్.

అపిచ

శ్లో. రోగిణీం రమణీం యస్తు సేవతే నష్టమానసః
బలక్షయో భవేత్తస్య వ్యాధిభిః స ప్రపీడ్యతే.

గర్భిణి రోగిణులను సంగమించిన గర్భనాశనము బలక్షయము-వ్యాధిసంభవించునని చెప్పబడినది.

అపిచ

నద్యాం దేవగృహే చతుష్పథవటే శైలస్య సానౌ జలే.

5 వ సాయకం — 25 వ శ్లోకం.

నదియందు దేవాలయమునందు- నాల్గుత్రోవలుగలసినచోట నున్న మఱ్ఱివృక్షముక్రింద పర్వతసానువులక్రింద జలములయందు సురతము నిషేధింపబడినది.

ఈవిధముగ నాయుర్వేదోపదేశానుసరణ మీశాస్త్రమునకు గలదనుట విస్పష్టము.

ఈ యాయుర్వేదోపదేశవిరుద్ధములైన కారణములు దేహశైథిల్యాదులను గలుగజేయునని చెప్పబడెను. విలాసవంతులైన పురుషులు తాముసాధింపదలచిన స్త్రీలయొక్కయు దమయొక్కయు ప్రకృతి- తత్త్వము- స్వభావము- మదనాతపత్రము- కాలము-మొదలగువిషయములను గమనించి కామకలాకలాపమునకు గడంగినచో దోషకరముకాదని కరణప్రకరణ ప్రారంభమందే చెప్పబడినది. మఱియు

శ్లో. యో భార్యాయామృతౌ మోహాదంగనేవ ప్రవర్తతే
తస్య స్త్రీచేష్టితాకారో జాయతే షండసంజ్ఞితః.

శ్లో. ఋతౌ పురుషవద్వాపి ప్రవర్తేతాంగనా యది
తతః కన్యా యది భవేత్ సా భవేన్నరచేష్టితా.

సుశ్రుతం - సూత్రస్థానం 2 వ అధ్యాయం.

ఎవడు భార్యయందు ఋతుకాలమున మోహముతో స్త్రీవలె ప్రవర్తించునో వానికి స్త్రీచేష్టితాకారుడైన నపుంసకుడు అనగా షండుడుజన్మించును. మఱియు నేయువతి ఋతుకాలమున పురుషునితో సంగమించునప్పుడు పురుషునివలె ప్రవర్తించునో నాసమయమున కన్యకజనించినయెడల పురుషచేష్టలుకలదగును.

ఈవిధముగ నాయుర్వేదశాస్త్రకారులగు మహర్షులచేత విప రీతరతము షండత్వాదిదోషకారణమై హేయమని ప్రతిపాదింపబడినది.

ఇంతేగాక విపరీతరతమునకుఁ బనికిరాని స్త్రీలనుగూర్చి యిట్లు వక్కాణించియున్నారు.

శ్లో. అల్పప్రయుక్తా ఋతుయోగయుక్తా
గర్భాలసా స్థూలతనుర్నతాంగీ
క్షీణా నవోఢా జ్వరితా చ నారీ వర్జ్యా
రతిజ్ఞైర్విపరీతబంధే.

ఋతుమతి-గర్భవతి-స్థూలాంగి- వంగినశరీరముగలది- శుష్కించినది- నవోఢ- జ్వరపీడిత- ఈ స్త్రీలు విపరీతరతమున కనర్హులు. అని నిషేధించుటవలన విపరీతరతము కూడదని స్పష్టమైనదిగదా! అట్టిచో నీశాస్త్రమెట్లు గర్హ్యమైనది?

కామశాస్త్ర మశ్లీలములతోఁ గూడియుండుటచేఁ బరిత్యాగార్హమని తలంచు మూఢు లీక్రిందిశ్లోకములను బరిశీలింపవలయును.

శ్లో. లలితా పరిణీతా తు వనితా సా ప్రకాశ్యతే
దాంపత్యసుధపీయూషసందోహం యా ప్రవాహయేత్.

శ్లో. కుటీరమపి దీనానాం యయుం చ సమలంకృతం
ఇంద్రమందిరసౌందర్యమహిమానం విడంబయేత్.

శ్లో. ప్రశస్తా చ రతిః సైవ యయా తు హృదయస్థయా
స్వాంతే నితాంతం శాంతిస్యాల్లోకద్వయసుఖావహా.

శ్లో. విషయాంభోధికల్లోలాద్యా చ జీవనపాదపం
విశీర్ణమూలం ఝటితి సరసం పరికల్పయేత్.

శ్లో. లోకం ధర్మార్థకామాని రాజనీతించ ప్రత్యయం
సమాలోక్య ప్రవర్తేత సంయతో దారసంగ్రహే.

శ్లో. రతిశాస్త్రరహస్యజ్ఞః పురుషార్థత్రయస్థితిం
పాలయన్విధివద్యుక్తః సుఖమక్షయమశ్నుతే.

ఏయువతి దాంపత్యసుఖామృతప్రవాహమును ప్రవహింపఁ జేయునో నట్టి కాంతను పరిణయమాడవలయును.

ఏకాంత దీనునికుటీరమునైనను దేవేంద్రమందిరమువలె దీపింప జేయునో నట్టిస్త్రీని బెండ్లాడవలయును.

తనహృదయమును స్థానముగాఁజేసికొనఁజాలిన కామినిని పరిణయమాడి యామెతో రతిక్రీడల ననుభవించినచో నయ్యది ప్రశస్తమై యెల్లప్పుడు మనస్సునకు శాంతినొసఁగి యిహపరలోకములలో సుఖదాయకమగును. ఇవ్విధంబుగ సర్వలోకంబులకు నుపకారకరమైన యీశాస్త్రము ధర్మార్థకామములకు రాజనీతికి నుపదేశమగుటచే దీని నధ్యయనముఁ గావించినవాఁడు మోహమగ్నుఁడై స్వేచ్ఛాప్రవర్తకుఁడు కానేరడు. అధికముగాఁ జెప్పుటవలన నేమియు లాభము లేదు. లోకమందు రతిశాస్త్రము సర్వజనసుఖకరమై ఇహపరముల కత్యంతోపయోగకారియై యుండుననుట నిర్వివాదాంశము. దీనియొక్క ప్రాశస్త్యమునుగూర్చి పూర్వాచార్యులైన వాత్స్యాయనాది మహర్షులు బహువిధములుగఁ జేర్కొనియున్నారు. ఇట్టి మహోత్కృష్టమైన తృతీయపురుషార్థప్రబోధకమగు కామశాస్త్రవిషయమును సంక్షిప్తముగా నుపదేశించిన యీపంచసాయకమను గ్రంథము మిక్కిలి లోకోపకారమనియు సర్వజనసమాదరణీయమనియుఁ గోవిదబృందము (పండితజనులు) తలంతురుగాక.

20-8-23,
పుదుచ్చేరి.

విద్వద్విధేయుడు,
యస్. చిన్నయ్య.

# ఇంతకుముందు ప్రకటింపబడిన గ్రంథములు.

కామగ్రంథమాల:- ౧ వ గ్రంథము.

## ర తి ర హ స్య ము

లేక

## కొక్కోకము (అను) కళాశాస్త్రము,

[రెండవకూర్పు]

తెలుఁగుభాషలో నిట్టిగ్రంథ మింతవరకును బ్రకటింపఁబడి యుండలేదు. కొక్కోక పండితుఁడు సంస్కృతమున రచియించిన రతి రహస్యము, ఎఱ్ఱన పద్యానువాదము, విపులమగు తాత్పర్యము సమ గ్రముగా, సర్వాంగసుందరముగా, బంధభేదముల చిత్రములతో ముద్రితమైన గ్రంథ మిదియొకటియే !

పూర్వము పోష్టు ఖర్చులుసహా రు. 12-0-0

ఇప్పుడు తగ్గింపుధర రు. 6-0-0, పోస్టేజి రు 0-8-0.

కామగ్రంథమాల:- ౨ వ గ్రంథము.

## చం ద్ర రే ఖా వి లా ప ము.

కూచిమంచి జగ్గకవి ప్రణీతంబగు

### హా స్య ర స ప్ర బం ధ రా జ ము.

ఆంధ్రదేశమునందుగల పెక్కు వ్రాతప్రతులతో సంప్రదించి కవివ్రాసినగ్రంథ మియ్యదియేయని నిర్ధారణ మొనర్చిన ప్రబంధరాజము.

వెల రు. 1-4-0 లు, పోస్టేజి రు. 0-4-0 లు.

కామగ్రంథమాల:- 3 వ గ్రంథము.

## కా ళి దా స ప్ర హ స న మ్.

సంస్కృతమున మహాకవి కాళిదాస విరచితమగు ప్రహసన మొకటైనను శ్రీయుత చివుకుల సత్యనారాయణశాస్త్రిగారిచే ఆంధ్రీకరింపఁబడిన యథార్థానువాదంబగు లంబోదరప్రహసన మొక టైనను ముద్రింపఁబడిన హాస్యరస ప్రహసనరాజము.

వెల రు. 1-0-0, పోస్టేజి రు. 0-4-0 లు.

కామగ్రంథమాల:- ౪ వ గ్రంథము.

## శృంగారపంచకము.

మ॥ రా॥ శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారిచే రచింపఁబడిన జాబులు రెండుభాగములును, సరసోక్తియుక్త కృష్ణశతకమును, సరస చాటువులును కవిసార్వభౌమ శ్రీనాథకృతమగు రసికాభిలాషమును, పూర్వకవులచాటువులు నిందుగలవు. 416 పద్యములుగల 112 పుటల పొత్తము. వెల రు. 1-0-0, పోస్టేజి రు. 0-4-0 లు.

కామగ్రంథమాల:- ౫ వ గ్రంథము.

## రతిరత్నప్రదీపిక.

మైసూరు ప్రభువగు ప్రౌఢదేవరాయలు రచించిన రతిశాస్త్రము: సంస్కృతమూలము, ఆంధ్రవివరణము.

ఇతర కామశాస్త్ర గ్రంథములందు జెప్పఁబడని ఔపరిష్టకవిధానములిందు వివరింపఁబడినవి. బంధభేదముల నిరూపించు పాశ్చాత్య ఛాయాచిత్రములు జేర్పఁబడినవి. అత్యుత్తమమగు కామకళానిబంధనము, అనుబంధముగా దత్తాత్రేయతంత్రముతో యోగిపుంగవుఁడగు దత్తాత్రేయునిచే ననుగ్రహింపఁబడినది. వాజీకరణ, స్త్రీవశ్యవిధానములకిం దనేక అనుభవయోగములుగలవు. ప్రత్యక్ష ఫలమిచ్చు, రసికజనోపకారియగు గ్రంథము.

గ్లేజుప్రతి వెల రు. 2-0-0 లు
రఫ్‌ప్రతి వెల రు. 1-0-0 లు } పోస్టేజి రు. 0-4-0 లు.

కామగ్రంథమాల:- ౬ వ గ్రంథము.

## బ్రహ్మానందము.

ఇందు బ్రహ్మానందశతకము- గోపీనాథ వేంకటకవి. 2. రామావధూటితారావళి- మాడభూషి వేంకటాచార్యుఁడు. 3. గణపతీయము- ప్రాచీనకవి. 4. శప్పవిజయము- తెనాలి రామకృష్ణుఁడు. 5. శృంగారశతకము- తోఁట విజయరాఘవకవి. ఈ 5 గ్రంథములును గలవు.

వెల రు 1-4-0 లు, పోస్టేజి రు 0-4-0 లు.

చిత్రిణికి చంద్రకళా ప్రదీపనము.

—♦ దశమి ♦—

శ్లో. చుంబిత్వాలక మున్మదః కరరుహై రాలిఖ్య వక్షోజకం
శ్రోణీ పృష్ఠ [1]భుజాంఘ్రి కర్ణ జఘన స్థానోరు యుగ్మస్థలీం
పాణిభ్యా ముపగూహయన్ స్వరమణీం కాంతో దశమ్యాం తిథౌ
కందర్పం ప్రతిబోధ్య చంద్రికలయా [2]కుర్యా న్నిజాం చిత్రిణీం.

తా. దశమినాడు ప్రియుడు తనప్రియురాలైన చిత్రిణి ముంగురులను ముద్దుగొనుచు, వక్షోజములకడ నఖక్షతమొనర్చి, కటి ప్రదేశము—వీపు—భుజములు—పాదములు—చెవులు—కటిప్రదేశమునకు పై భాగమును చేతులతో చక్కగాస్పృశించి మర్దించుచు చంద్రికళా ప్రదీపనమొనర్చి మన్మథుని మేల్కొల్పవలయును.

—♦ షష్ఠి ♦—

శ్లో. శ్లిష్ట్వా కందరకందలీం భుజలతా పాశేన [3]గాఢం పునః
పాయంపాయ మజస్ర [4]ముత్పలదృశాం వక్త్రారవిందాసవం
నాభీ కంఠ నితంబ [5]బింబ నఖరవ్యాపార పారంగమైః
షష్ఠ్యాం చంద్రికలాకలాప నిపుణై ర్దేయా నఖాః సర్వతః. 20

తా. షష్ఠి తిథియందు కాముకుడు ప్రియురాలైన చిత్రిణి యొక్క భుజములను తనభుజములతో కౌగలించుకొని, చేతులతో చక్కగా మర్దించుచు, నల్లకలువరేకులవంటి నేత్రములుగల ప్రియురాలి యధరమును మాటిమాటికి గ్రోలుచు, నాభి-కంఠము-పిరుదు-అధరములయందు నఖక్షతముచేయుటలో సమర్థుడై చంద్రికళాప్రదీపనము కలుగజేయవలయును. అనగా కళావిదుడగు నాయకుడు షష్ఠినాడు సర్వదానఖక్షతముల నొనర్చి చిత్రిణిని రంజింప జేయ వలయును.

---

పా. 1. (ఎ) భుజాతికర్ణ, పా. (బి) భుజాస్యకర్ణ, పా. 2. కుర్యాన్నిజాం, పా. 3. గాఢంతతః, పా. 4. సంగమలయ వ్యాపార, పా. 5. ముత్పలదశాం

—♦ అ ష్ట మి ♦—

శ్లో. గ్రీవాయాం పరిరభ్య గాఢ మసకృ న్నాభిం నఖై రాలిఖన్
[1]దంతోష్ఠేన నిపీడయన్ [2]కుచతటీం కంఠే మనాక్ తాడయేత్
సానందం స్మరమందిరే కరికర క్రీడాయితాం కుర్వతా
నేతవ్యా తరుణీ స్వకీయవశతాం చండీతిథౌ [3]చిత్రిణీం. 21

తా. అష్టమినాడు నాయకుడు ప్రియురాలైన చిత్రిణి యొక్క కంఠమును తనకంఠమునకు జేర్చుకొని మాటిమాటికి నాభి ప్రదేశమున నఖక్షతముజేయుచు- దంతములచేతను పెదవులచేతను స్తనములను గట్టిగనొక్కుచు కంఠమునందు తాడనమొనర్చి మదన గృహమునందు సంతోషముతో కరికరక్రీడసల్పుచు చంద్రకళోద్దీపనముగలిగించి వశముజేసికొనవలయును.

—♦ స ప్త మి ♦—

శ్లో. ఆలింగ్య ప్రసభం కపోల నయన శ్రోణీ [4]శ్రుతీ శ్చుంబయన్
స్థానేష్వేషు నఖప్రదానకుశలో దత్వా నఖా న్నిర్దయం
[5]నందశ్యాధరపల్లవం కుచయుగం చాకృష్య [6]కేశాన్వశే
[7]చిత్రాం సంవిదధీత [8]సీత్కృతవతీం భానో స్తిథౌ నాయకః. 22

తా. సప్తమితిథియందు నాయకుడు సీత్కారముజేయుచు చిత్రిణిని ఆకస్మికముగ నాలింగనమొనర్చుకొని చెక్కిళ్లు-నేత్రములు-కటిప్రదేశము- చెవులను ముద్దుపెట్టుకొనుచు పైనచెప్పబడిన స్థానములయందు నేర్పరితనముగ కఠినమైన నఖక్షతములుంచి అధరోష్ఠమును గాఢముగ చుంబించుచు శిరోజములను—కుచములను చేతులతో గ్రహించిన కళోద్దీపనము కలిగి చిత్రిణి వశ్యురాలగును.

---

పా. 1. దంతోష్ఠంపరి పీడయన్, పా. 2. కుచతటీంచుంబన్మనాక్, పా. 3. కామినీం,
పా. 4. శ్రుతీశ్చుంబయేత్, పా. 5. దృష్ట్వాచాధర, పా. 6. కేశాన్దృశో,
పా. 7. రున్మేషంవిదధీత, పా. 8. సీత్కృతజుషోభానోస్తిథౌ.

శంఖినికి చంద్రకళాప్రదీపనము.

—♦ ఏకాదశి—త్రయోదశి ♦—

శ్లో. [1]కత్వా ముల్లసితై ర్వేలిఖ్య కరజై రాలింగ్య దోర్భ్యాం ముహుః
[2]గాఢంచోరసిజౌ నిపీడ్య సుతరాం విష్ణోస్తిథౌ చంద్రవిత్
ఆచుంబేచ్చ కపోల కంఠ [3]గలకే మ్మృద్వ న్నురోజద్వయం
కందర్పస్యతిథౌ నఖక్షతి [4]వశాత్ ద్రాక్ శంఖినీం ద్రావయేత్. 23

తా. ఏకాదశితిథియందు చంద్రకళావేత్తయైన నాయకుడు శంఖినీ నాయికను చంకలయందు నఖక్షతమొనర్చి మాటిమాటికి బాహువులతో నాలింగనమొనర్చుకొని స్తనములను దృఢముగ పీడించినయెడల కళోద్దీపనముకలిగి శంఖిని వశ్యురాలగును.

త్రయోదశినాడు నాయకుడు శంఖినియొక్క కపోలములు కంఠము కంఠప్రదేశములను ముద్దిడుకొని కుచద్వయమును మర్దించుచు నఖక్షతముచేసినయెడల శంఖినిద్రవించును.

—♦ సప్తమి—చతుర్దశి ♦—

శ్లో. వ్యాదష్టౌష్ఠపుటః కపోలనయన శ్రోత్రం నఖై [5]రాలిఖన్
సాన్ద్రానంద నిగూఢకంఠవలయం భానో స్తిథౌ భామినీం
ఆఘాతం నఖరై శ్చ [6]నాభిచరణ గ్రీవా కుచోరస్థలే
కృత్వా లిఖ్యచ భూతనాథదివసే [7]కుర్యా త్సుధీ విహ్వలాం. 24

తా. కాముకుడైన నాయకుడు సప్తమితిథియందు శంఖిని యొక్క పెదవులపై దంతక్షతమొనర్చి కపోలములు—నేత్రములు చెవులయందు నఖచిహ్నము లుంచినయెడల నామెసంతసమున మునింగి ప్రియునకు కంఠాభరణమువలె నుండును.

చతుర్దశి తిథియందు ప్రియురాలియొక్క నాభి- పాదము-కంఠము- కుచములు- వక్షస్థలమునందు తాడనమొనర్చి నఖక్షతములు చేసినచో శంఖిని కామవిహ్వలయగును.

పా. 1. మాస్యా, పా. 2. గాత్రంచోరసిజౌ, పా. 3. గలకం, పా. 4. వశాత్ ప్రాక్శంఖినీం, పా. 5. రాలిఖేత్, పా. 6. తత్రచరణ, పా. 7. సేవే త్సుధీ.

హస్తినికి చంద్రకళాప్రదీపనవిధి.

—♦ నవమి ♦—

శ్లో. ఆకంఠం పరిరభ్య దోర్లతికయా నిష్పీడ్య వక్త్రాంబుజం
[1]కక్షాంతః స్తనమండలోదరతటీం చుంచన్నఖై రామృశన్
క్షోభ్యాంతికయాతిథౌ [2]వధముహుః కామాలయం సంస్పృశన్
[3]సందశ్యాధరపల్లవం గ్రహాతిథౌ కార్యా ద్రుతాం హస్తినీం. 25

తా. నవమితిథియందు నాయకుడు హస్తినీజాతి నాయిక యొక్క కంఠమును బాహువులచే కౌగలించుకొని, ముఖకమల మందలి యధరామృతమును గ్రోలుచు, చంకలు-స్తనమధ్యప్రదేశము మొదలు ఉదరమువరకు మండలాకారముగ నఖక్షత మొనర్చి, మదన గృహమును మాటిమాటికి స్పృశించి, అధరోష్ఠమందు దంతక్షతమొ నర్చినచో నామెకు కళోద్దీపనముకలిగి వశ్యురాలగును.

—♦ పూర్ణిమ—అమావాస్య ♦—

శ్లో. సంపూర్ణేందుతిథౌ పరిక్షయదినే తస్యైవ తుల్యాతిథిః
తస్యామేవ వశీకృతా శశికళా సంబోధనైః కామినీ
[4]కామాగార చుచూలికాసు కరజైర్దంతైశ్చ దంతచ్ఛదైః
ఆశ్లేషైః [6]పరిచుంబనైశ్చ వివిధై రిత్యాహ నందీశ్వరః. 26

తా. పూర్ణిమ- అమావాశ్యలయందు హస్తినీజాతి యువతి యొక్క మదనగృహము—స్తనాగ్రములయందు నఖక్షత దంతక్షతము లొనర్చి, అనేకవిధములుగ దృఢాలింగనములు-చుంబనముల నొనర్చిన యెడల చంద్రికళా ప్రదీపనముకలిగి ప్రియునకు వశ్యురాలగునని నందీశ్వరమతము.

పా. 1. కక్షాంచ. పా. 2. విహముహుః. పా. 3. సంస్పృశ్యాధరపల్లవం.
పా. 4. కామాగక్త. పా. 5. సంతాస్యదెర్శిశ్చవైః. పా. 6. పరిరంభణైశ్చ.

పద్మిని మొదలగు నాల్గుజాతుల స్త్రీలయొక్క రతికాల నిరూపణము.

శ్లో. [1]యామిన్యాః కథిత శ్చతుర్థచరణః కాలో నలిన్యా రతే
ప్రారంభప్రహరే ప్రియాతిసుఖితాం చిత్రప్రియాం చిత్రిణీం
శంఖిన్యా స్సముదీరితః కవివరై ర్యామస్తృతీయో [2]రతౌ
మాతంగీ ద్రవతామ్రుపైతి [3]నితరాం నక్తం దినస్యార్థయోః. 27

తా. రాత్రి నాలుగవజామున రతియొనర్చిన పద్మిని సంతోషపడును. తొలిజాము అనగా రాత్రిప్రథమయామము చిత్రిణికి ప్రియమైనది. రాత్రిమూడవయామము శంఖినికిష్టము. హస్తినికిమాత్రము పగలు పదురెండుగంటలుమొదలు అర్ధరాత్రివరకు ప్రియమైనకాలము. ఈసమయములో నెప్పుడు రతియొనర్చినను హస్తిని సంతసించును.

శ్లో. సుఖయతి నపుమాంసం పద్మినీ క్వాపి రాత్రౌ
నిధువనమితి తస్యాం నైవ కించిత్ప్రయోజ్యం
శిశురపి యది కాంతాం వాసరే తాముపేయాత్
వికసతి రవియోగా త్సాహతా త్పద్మినీవ. 28

తా. పద్మినీజాతిస్త్రీ రాత్రికాలమున పురుషునకు సుఖప్రదురాలు కాదు. సంతోషమునీయదు. అందువలన పురుషుడామెతో రాత్రికాలమున సంభోగింప బ్రయత్నింపకూడదు. దినమందు అనగా పగటివేళ ఆమెకడకు బాలకుడు వెళ్ళినను సూర్యోదయమువలన పద్మము వికసించినట్లు ఆమెహృదయము ఆకస్మికముగ వికసించును.

సత్వనిరూపణము.

—♦ దేవసత్వ ♦—

శ్లో. త్రివలివలితమధ్యా కంబుకంఠీ విదగ్ధా
కమలసురభిదేహా కేతకీగర్భభవ్యా
శుచిచరిత[4]పవిత్రా శీలసంతోషయుక్తా
సులలితపికవాణీ స్యాదియం దేవసత్వా. 29

పా. 1. కామిన్యాః. పా. 2. మతః. పా. 3. సురరాం. పా. 4. విచిత్రా.

తా. ఉదరమునందు వళిత్రయము (కడుపుముడతలు) కలది కంఠమునందు మూడురేఖలుకలది- శంఖమువంటి కంఠము-తామర పుష్పమువాసనవంటిశరీరవాసన-పవిత్రచరిత్రము-గౌరవర్ణము-మొగలి పువ్వుయొక్క గర్భముతో సమానమగు సుందరాకారము-శీలము సంతోషముకలిగి కోకిలవంటి శ్రావ్యమగు కంఠధ్వనిగల యువతి దేవ సత్వ యనబడును. సామాన్యముగ ఆమెనే పద్మినీజాతి స్త్రీయందురు.

—♦ గంధర్వసత్వ ♦—

శ్లో. [1]బహుల చపలదృష్టిః నృత్యగీతాది దక్షా
[2]మధుర బహులగంధా పుష్పమాలానురక్తా
శిశిర సురభి మాస క్రీడన ప్రేమ[3]పాత్రిం
భవతి రుచిరమూర్తిః సైవ గంధర్వసత్వా. 30

తా. చపలదృష్టి నృత్యగీతాదులయందు సమర్థత కలిగియుం డుట-శరీరమునుండి మధురమైనసువాసన - పుష్పమాలల యందను రక్తి-శిశిర వసంత ఋతువులలో రతిక్రీడయందాసక్తి కలిగియుండుట రూపవతియై యుండుస్త్రీ గంధర్వసత్వయని తెలిసికొనవలయును.

—♦ యక్షసత్వ ♦—

శ్లో. గురుకుచ యుగభారా గౌర[4]దేహా నతాంగీ
తరుణహారిణనేత్రా కోపనా వీతలజ్జా
వివిధ [5]మధురవాక్యా మత్స్య మాంసానురక్తా
మునిభి రియ[6]మనస్థా యక్షసత్వా ప్రదిష్టా. 31

తా. గొప్ప బరువైన కుచములు-గౌరవర్ణముగల దేహము వంగినశరీరము-లేడికన్నులవంటి కన్నులు - కోపస్వభావము (అనగా చిరాకుపడుట) సిగ్గులేకుండుట- అనేకవిధములగు మధురవాక్యములు మత్స్యమాంస భక్షణమందాసక్తి గలస్త్రీ యక్షసత్వయని తెలుసు కొనవలయును. ఇది మునీశ్వరుల అభిప్రాయము.

పా. 1. చటులచపల, పా 2. జనిత వివిధ తుష్టిర్గంధమాల్యానురక్తా, పా. 3. పాత్రీ, పా. 4. దేహాతిదేహా, పా. 5. మధుభోజ్యా, పా. 6. మనర్ఘ్యా.

—♦ ప్రేతసత్వ ♦—

శ్లో. గిరివిహరణ విఖ్యారాత్రి[1]సంచార వీరా
మలిన పిశునచిత్తా కుత్సితాహార చేష్టా
వికృతవదన చంద్రా కృష్ణవర్ణాఽతిఖర్వా
మలినవసనరక్తా కీర్తితా ప్రేతసత్వా. 32

తా. పర్వతములయందు విహరించుటలో నేర్పుకలిగియుండుట రాత్రిసంచారమునందు సమర్థత-మలినమైన దుష్టమైన మనస్సు అభక్ష్యభక్షణము అనగా తినకూడని వస్తువులను తినవలయునని ప్రయత్నించుట-కురూపము-నల్లని శరీరవర్ణము - మాసిన బట్టలు కట్టుట-కురుచశరీరము గలస్త్రీ ప్రేతసత్వయని గ్రహింపవలయును.

ఇతి శ్రీకవిశేఖర జ్యోతిరీశ్వరాచార్య విరచితే
పంచసాయకే జాత్యాది నిరూపణో నామ ప్రథమః సాయకః

—♦ త ప్పొ ప్పు లు ♦—

| పుట | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 26 | కార్యత్రికే కృత్రిమ. | తౌర్యత్రికే కృత్రిమః |
| 4 | 26 | కష్టయిక | కష్టక |
| 5 | 10 | సంఖ్యాతి | సంఖ్యతి |
| 5 | 17 | సుతతము | సురతము |
| 5 | 23 | దశ్చల | ధశ్చల |
| 6 | 3 | కళాలాలీ | కలాలీలా |
| 8 | 6 | నిపీఢ్వ | నిపీడ్య |
| 8 | 20 | వాత్యా | వాత్స్య |

పా. 1. సంచారధీరా.

శ్రీరస్తు.

# పంచసాయకము.

## —♦ ద్వితీయ సాయకము ♦—

### —♦ రతిభేదనిరూపణము ♦—

శ్లో. ఆయామైః పరిణాహైశ్చ పురుషా లింగైర్వరాంగైః స్త్రియః
[1]జ్ఞాతవ్యాశ్చ రసగ్రహరుణ [2]సమఖ్యాతాంగులైః సర్వతః
జాత్యాతేఽపి శశావృషాశ్చ తురగాః ప్రాజ్ఞైః స్మృతాస్తాఫునః
మృగ్యశ్వా కరిణీతి విస్తరభయాత్ సంక్షిప్య నిష్కృష్యతే.

తా. పొడవు - విశాలము - అను రెండింటి పరిణామము ననుసరించి స్త్రీ పురుషుల భగదండములు ఆరు - తొమ్మిది - పదు రెండు అంగుళములు ప్రమాణము కలిగి యుండును. పురుషులలో శశజాతి పురుషుని లింగము ఆరు అంగుళములు, వృషజాతి పురుషుని లింగము తొమ్మిది అంగుళములు, అశ్వజాతి పురుషుని లింగము పండ్రెండు అంగుళముల పొడవు కల్గియుండును. అట్లనే స్త్రీలలో కూడ ఆరుఅంగుళముల లోతు భగముగలది మృగిఅనియును తొమ్మిది అంగుళముల లోతుభగముకలది అశ్వా లేక బడబా అనియును పదురెండంగుళములలోతు భగముకలది కరిణిఅనియు చెప్ప బడుచున్నది. ఈవిధముగ లింగ భగములయొక్క దీర్ఘ విశాలముల ననుసరించి స్త్రీ–పురుషుల భేదము మూడువిధములయ్యెను.

—* నాయికా నాయకుల సంరతి నిరూపణము *—

శ్లో. శశక హరిణ పత్యోర్గోతురంగ్యోః సమేవ
హయ గజాపతి నార్యో రేకరూపం రతం స్యాత్
ఇహ భవతి నితాంతం ప్రీతి రన్యోన్య యోగాత్
[2]అపరమణ మశక్యం స్త్రీ కథం స్వీకరోతి. 2

---

పా. 1. జ్ఞాతవ్యాస్తు. 1. జ్ఞేయాశ్చాబ్ధి. పా. 2, కలాఖ్యాతాం. పా. 3. స్మృతాస్తాః పరం. పా. 4. నిష్కృష్యతేః. పా. 5. పతిపత్యోః. పా. 6. అపరరణమసేవ్యం

తా. మృగజాతి స్త్రీకిని శశకజాతి పురుషునకునూ, అశ్వజాతి స్త్రీకి వృషభజాతి పురుషునకునూ, హస్తినీజాతి స్త్రీకిని అశ్వజాతి పురుషునకునూ, సంగమము సంతోషప్రదము, అట్లు కాదేని స్త్రీకి సంభోగమున ప్రాణాంతకదుఃఖము కలుగును.

శ్లో. మృగీవృషంచే ద్బడబా తురంగం
1అత్యుచ్చమేతత్ ద్వితయం వదంతి
అశ్వాశశం 2గోఃకరిణీసముద్ధం
నీచద్వయం తుష్టికరం నయూనోః. 3

తా. మృగజాతియువతికిని వృషజాతిపురుషునకును అశ్వజాతి యువతికిని అశ్వజాతిపురుషునకు జరుగురతము ఉచ్చరత మనబడును. అశ్వజాతిస్త్రీకి శశజాతిపురుషునకును కరిణీజాతియువతికి వృషజాతి పురుషునకు గలుగురతము నీచరతమని చెప్పబడును. నాయికానాయకులకు ఈరతము సంతుష్టికరము కాదు.

—: అత్యుచ్చ - అతినీచరతనిరూపణము :—

శ్లో. మృగే హయం హస్తి వధూ శశంచే
దత్యుచ్చ నీచం సురతం వదంతి
3ప్రమాణభేదేపి నచ ద్రవంతి
తస్మి న్నతృప్యంతి నితంబవత్యః. 4

తా. మృగజాతినాయికకు అశ్వజాతిపురుషునకు జరుగురతము అత్యుచ్చరతమనియు హస్తినీజాతిస్త్రీకి శశజాతిపురుషునకు జరుగు రతము అతినీచమనియు చెప్పుచున్నారు. కారణమేమన మృగి యొక్క యోనిప్రమాణము ఆరు అంగుళములు అశ్వజాతిపురుషుని లింగము పదురెండుఅంగుళములు పొడవు అగుటచే అత్యుచ్చరత మగును. కరిణియొక్క భగప్రమాణము పదురెండంగుళములును శశ జాతిపురుషుని లింగము ఆరుఅంగుళములగుటచే అతినీచరత మన

1. ఏతత్ ద్వయంతూచ్చరతంవదంతి 2. గోఃకరిణీంచనైతన్ 3. ప్రాణప్రభేదేపి

బడును. ప్రమాణభేద ముండుటవలన ద్రవింపకపోవుటచే స్త్రీలకు సుఖముండదు.

—: ఉత్తమ మధ్యమాధమరతి లక్షణము :—

శ్లో. స్త్రీపుంసయో స్తుల్యరతం ప్రశస్తం
మధ్యద్వయం మధ్యమ మామనంతి
అత్యుచ్చనీచం సురతం వదంతి
మృగీహయం హస్తివధూం శశంచ. 5

తా. స్త్రీపురుషులకు తుల్యరతమే ప్రశస్తమైనది. కారణమేమనగా వారి జననేంద్రియములు రెండును సమానముగానుండును. కొంచెము భేదమున్న మధ్యమరతమనియు అధికభేదమున్న అధమరతము లేక అతినీచరతమనియు చెప్పబడును. ఎట్లనగా హరిణి - అశ్వజాతిపురుషుని రమించిన అత్యుచ్చరతమగును. హస్తిని శశజాతిపురుషుని పొందుట అసంభవరతము. అతినీచమగును. జననేంద్రియ ప్రమాణములలో మిక్కిలి భేదముండుటచే అట్టిరతము కూడనిదగుచున్నది.

శ్లో. ప్రీతి స్సమా స్యా త్సురతే సమాఖ్యే
నీచద్వయే యోషిత ఏవ తుష్టిః
అత్యుచ్చకే వాప్యతినీచకేవా
[1]తుష్టిర్న పుంసాం న చ సుందరీణాం. 6

తా. సంభోగము సమానముగానున్నప్పుడు ప్రీతియు సమానముగనుండును. రెండువిధములైన నీచరతులలో స్త్రీలకే సంతోషము కలుగును. ఎట్లనగా తొమ్మిదిఅంగుళముల భగముగల కామినికి పండ్రెండంగుళముల ధ్వజముగల పురుషుడును, ఆరుఅంగుళముల భగముగల నాయికకు తొమ్మిది అంగుళములు ధ్వజముగల పురుషుడును లభించినచో స్త్రీలకే సంతోషముకలుగును. గాని 12 అంగుళముల ధ్వజము గలవానికి ఆరుఅంగుళములు గల కామినియు (అనగా)

పా. 1. తుష్టిర్నయూనాం

తురగజాతిపురుషునకు మృగజాతిస్త్రీ శశజాతిపురుషునకు కరిణియు లభించినచో సంభోగము ఇర్వురకు సుఖప్రదముకాదు.

—: ప్రచండాదివేగత్రయలక్షణము :—

శ్లో. ప్రచండ వేగోఽప్యథ మధ్యవేగ
స్తథాఽపర స్స్యా ల్లఘు నామధేయః
పుంస స్తరుణ్యా ఉభయో రపీహ
త్రిధా కవీంద్రైః సురతం వదంతి. 7

తా. ప్రచండవేగము- మధ్యవేగము - లఘువేగములని సురత కాలమందలి వేగములు మూడువిధములు. స్త్రీపురుషుల కిర్వురకు నీవేగత్రయము శరీరమందు స్వాభావికముగనుండు శక్తి ననుసరించి యుండును.

: కొక్కోకుని మతము :

కొక్కోకుడు రతిరహస్యమునందు ప్రచండాదివేగభేదముల వలన రతితొమ్మిదివిధము లని చెప్పియున్నాడు. ఎట్లనగా:—

శ్లో. మందమధ్యమ చండాఖ్యైర్వేగతోప్యుభయో తథా
వేగః కాముకతాజ్ఞేయ స్తేనాపి నవధారతమ్.

1. మందవేగముగల స్త్రీ పురుషులరతము 2. మధ్యవేగము గలవారిరతము 3. ప్రచండవేగముగలవారిరతము 4. మందవేగతో మధ్యవేగునికి కలుగురతము 5 మధ్యవేగతో మందవేగునికిజరుగు రతము 6. మందవేగతో చండవేగునికిజరుగురతము 7. మధ్యవేగతో చండవేగునకుజరుగురతము 8. చండవేగతో మధ్యవేగునికిజరుగురతము 9. చండవేగునితో మందవేగకుజరుగురతము. ఇట్లు తొమ్మిదివిధము లుగా జెప్పెను.

—: శశాదినాయకస్వరూపనిరూపణము :—

శ్లో. దీర్ఘాక్షాః స్థూలదేహాః లఘుసమదశనాః లంబకర్ణా స్సువాచో
గ్రీవాయాం జానుదేశే [1]కరకమలతలే కాలిమానం వహంతః

1. కరచరణతలే

1అల్పాహారాస్సుశౌచాదినమధిశయినఃకా 2నిమన్తోబలాఢ్యాః
క్రీడావన్తో వినీతాః లఘుతరసురతాః పుణ్యభాజ శ్శశాస్యుః. 8

తా. పెద్దనేత్రములు స్థూలదేహము సమానమైన చిన్నవగు పల్లు వ్రేలాడుచెవులు మంచివాక్కులు - కంఠము - జానువులు చేతులయందు నలుపుకలిగియుండుట కొలదిభోజనము అల్పశుచి - పగటివేళపరుండుట - సుందరమైన కాంతిగల శరీరము - బలముగల దేహము - ఆటలయందాసక్తి నమ్రత లఘువైనసంభోగము ధార్మికత్వముగల పురుషులు శశజాతిపురుషులనబడుదురు.

—: మృగజాతినాయకలక్షణము :—

శ్లో. 3సుచారుకేశో మృదువాక్సువేషః
సుదీర్ఘకంఠ శ్చపల స్సునేత్రః
సురక్తపాణి స్సమ దంతపంక్తిః
సౌభాగ్యయుక్తః కథితో మృగోఽయం. 9

తా. నల్లగా మెరయుచున్న అందమగు తలవెండ్రుకలు మృదువాక్కులు మంచివేషము దీర్ఘమైన అందమైన కంఠము - చపలత - సుందరములైన నేత్రములు - రక్తముగల కమలపుష్పముల వంటి చేతులు ముత్యములవలె సమానమైన ప్రకాశించు దంతపంక్తి గొప్పతనము సౌభాగ్యముగల పురుషుడు మృగజాతినాయకుడన బడును.

—: వృషభజాతినాయకలక్షణము :—

శ్లో. స్థూరాకారాః సదర్పాః సురతరసకలా లంపటా స్సుందరాంగాః
వ్యాఘోరస్కా- 4స్సురూపా స్సుసమజఠరిణో మాంసలా లోలనేత్రాః
అత్యంత 5ప్రౌఢవాచో పరిలఘుధృతయఃక్రోధనాముధ్యవేగాః
ఉత్తానో లింగ 6మీషద్విఋతనవమిత్తై రంగుళీకై ర్వహన్తి. 10

1. అల్పాహారాల్పశౌచా 2. ధనాఢ్యాః పా. 3. సుచారువేషో
4. సురూపాః 5 ప్రౌఢవాక్యాః 6 ఈషత్ ద్విగుణనవమితైః

తా. దీర్ఘమై సుందరమైన ఆకారము దర్పము రతికి సంబంధించిన చతుష్షష్టికళలయందు నేర్పరితనము ప్రజ్వలించుచున్న జఠరాగ్ని అనగా అధికముగా తిని జీర్ణించుకొనగల్గియుండుట బలసిన రొమ్ము సురూపము చంచలనేత్రములు ప్రౌఢవాక్యములు బలమైన భుజములు కోపము సురతమందు మధ్యవేగము అత్యంతసహనము లావు తక్కువయై తొమ్మిదిఅంగుళములు పొడవుగల కామదండము గలపురుషులు వృషభజాతి పురుషులనబడుదురు.

—: అశ్వజాతి పురుష లక్షణము :—

శ్లో. కార్యేదృష్టా బలిష్ఠాః సితసమదశనాః 1పీవరాస్యావరాక్షా
గ్రీవాబాహూరుదీర్ఘాః పరహితనిరతాః సాత్త్వికాః స్నిగ్ధవాచః
నిర్లజ్జా శ్చారుశీలాః పృథుతరగతయ శ్చండసంభోగరక్తాః
అశ్వాలింగంవహంతో 2యువతిజనమతంభానుసంఖ్యాంగుళీకం.

తా. కార్యమందు దృఢత్వము బలముకలిగియుండుట సమమైన తెల్లని దంతములు గంభీరమైన ముఖము పెద్దకన్నులు దీర్ఘములైన బాహువులు మెడ తొడలు విశాలమైన రొమ్ము పరోపకారమందాసక్తి సత్వగుణము మనోహరములైనవాక్కులు సంభోగమున సిగ్గులేకుండుట చక్కనిస్వభావము శీఘ్రగమనము సంభోగమునందు చండవేగము పదురెండంగుళములు పొడవుగల కామదండము స్త్రీలకు మనోహరుడై యుండుట అశ్వజాతి పురుషలక్షణము.

—: మృగజాత్యాది నాయికా లక్షణము :—

మృగజాతినాయిక.

శ్లో. మృద్వంగీ దీర్ఘనేత్రా వరబిసలతికా కోమలా దీర్ఘబాహుః
శోణాంభోజాభిరామంవహతి కరయుగంత్రిహ్రస్వమధ్యాసుకేశీ
సుశ్రోణీః కంబుకంఠీ పృథుకుచయుగళాయా వహత్యంగుళీకైః
షడ్భిః కందర్పగేహం కథయతి హరిణీం తా మిహా జ్యోతిరీశః.

పా. 1 పీవరాస్యాగవక్త్రా. పా. 1 పీతరాస్యాధరాశ్చ. పా. 2 యువతిజనరతా. పా. 3 వేదమధ్యా

తా. మృదువైనదేహము దీర్ఘములైననేత్రములు తామర తూండ్లవలె మెత్తని పొడవైన బాహువులు ఎర్రతామరపూవులవలె మనోహరములైన అరచేతులు సన్ననినడుము అందమైనశిరోజములు చక్కని కటిప్రదేశము శంఖమువంటి కంఠము గొప్పవై బరువగు స్తనములు ఆరుఅంగుళములు లోతుగల భగము గలకామిని హారిణిలేక మృగజాతినాయిక యని జ్యోతిరీశ్వరకవిచెప్పినాడు.

—: అశ్వజాతి నాయికా లక్షణము :—

శ్లో. వ్యానిమ్నోన్నతుంగ శీర్షా బహుతరకపిశ స్థూలకేశ ప్రచారా
చంచన్నీలాంబుజాక్షీ సులలితవదనా తుంగ వక్షోజభారా
గంభీరావర్తనాభి ర్వలిభి రుపగతా శ్రోణిభారా లసాంగీ
సేయం రంధ్రాంగులీకం వహతి రతగృహం రంధ్రకం నైతురంగీ.

తా. నిమ్నమై ఉన్నతమైన శిరము బూడిదరంగుగలిగి దట్టమై నిడుపుగల శిరోజములు నల్లతామరవంటి నేత్రములు చపలదృష్టి సుందరముఖము ఉన్నతములైనకుచములు లోతైన సుడితిరిగిననాభి వళిత్రయముగల ఉదరము పిరుదులభారముచే అలసటజెందిన శరీరము తొమ్మిదిఅంగుళములు లోతుగల కామగృహము గల యువతి అశ్వజాతి నాయికయని చెప్పబడును.

—: హస్తినీజాతి నాయికా లక్షణము :—

శ్లో. స్థూలాంగీ స్థూలగండా లఘుతరనయనా స్థూలనీలాల్పకేశా
బింబోష్ఠీ పీనబాహుః కఠిన గురుకుచా హీనపర్వాతిదుష్టా
నిర్లజ్జా రాసభోక్తి స్ఖలితవదనా సర్వదా కష్టసాధ్యా
నిర్దిష్టా హస్తినీయం వహతి రవిసమై రంగుళై ర్గుహ్యదేశం.

తా. స్థూలదేహము స్థూలములైన గండస్థలములు చిన్నకన్నులు నల్లనికొలదియైన తలవెండ్రుకలు దొండపండువంటిఅధరము బలసినచేతులు కఠినములై గొప్పవైనకుచములు దుష్టస్వభావము నిర్లజ్జ గాడిదవలె కర్ణకఠోరముగా మాట్లాడుట చంచలమైనవదనము రతియందు కష్టసాధ్యురాలై యుండుట పండ్రెండంగుళములు లోతుగల కామగృహముగలస్త్రీ హస్తినీనాయిక యనబడును.

—: బాలాద్యవస్థా లక్షణము :—

శ్లో. షోడశవర్ష వయస్కాం బాలామిత్యాలపన్తి ధీమంతః
వింశత్యబ్దా తరుణీ 1త్రింశాప్రౌఢాం పంచాశతీవృద్ధాం. 15

తా. పదునారువత్సరములు ప్రాయమువరకూ బాలయనియు ఇరువదివత్సరములు మొదలు ముప్పది సంవత్సరములవరకూ ప్రాయము కలది తరుణియనియు ముప్పది సంవత్సరములు మొదలు యాబది సంవత్సరములవరకూ ప్రాయముకలది ప్రౌఢయనియు ఏబది వత్సరములు దాటినది వృద్ధయని ధీమంతులగు పండితులు పల్కెదరు.

శ్లో. బాలా నూతనసంగమే రతికరీ సాంద్రాంధకారే భవే
దాలోకే సుఖమాతనోతి తరుణీ సంభోగలీలావిధౌ
ఆలోకేపి సుఖాయతే సరభసం ప్రౌఢా తమిస్రేంగనా
వృద్ధా జీవితహారిణీ నకురుతే కుత్రాపి సౌఖ్యంమనాక్. 16

తా. బాల దట్టమైన చీకటిలో నవయువకునకు నూతన సంగమమున సౌఖ్యమునిచ్చును. తరుణి ప్రకాశవంతమగు గృహములో ప్రియునకు పెక్కువిలాసములతో గూడిన రతిక్రీడాసుఖమునొసంగును. ప్రౌఢ తన మనోభావము నెరుకపరచుచు చీకటిలోను వెల్తురులోను నాయకునకు సంతోషము నిచ్చును. వృద్ధ ప్రాణాపహారిణియగును. ఆమెవలన పురుషున కెట్టి సుఖము కలుగదు.

—: దేశస్త్రీలలక్షణము :—

శ్లో. రూక్షాంగీ 2బహువాదినీ చలమతి 3ర్గీతప్రియా చాటులా
శైలాంభోనిధి పార్శ్వదేశ వనితా ప్రాయో భవేదీదృశీ
4అంభోదాగమ పుష్పమాస సమయే సేవ్యాః పునః5ప్రీణతా
ద్గుర్వాహార 6సుగంధమాల్య వసన స్నిగ్ధాంగరాగాదిభిః 17

తా. పర్వతప్రాంత సముద్రప్రాంత స్త్రీలకు కఠినశరీరము - గౌరవర్ణము శ్యామలవర్ణము కలిసిన శరీరచ్ఛాయ చంచలచిత్తము - సంగీతము పాడుటయందుత్సాహము సుగంధవస్తువులు పుష్పమాలలు

1 త్రింశాత్ ప్రౌఢాతతః పరంవృద్ధా 2 బహువర్ణినీ 3 శ్యశప్రియావాతలా 4 అంభోదాగమపుష్పకాలసమయే 4 వర్షాయాం కుసుమాకరేచ బహుశః 5 ప్రీతిదాతి సుగంధి

ఉత్తమవస్త్రములు సువాసనద్రవ్యములు లేపనమొనర్చుటయందు ప్రేమకలిగియుండుట - మొదలగు లక్షణములు కలిగి ఆనందమునొసంగగలిగి యుందురు.

శ్లో. గూఢగ్రంథి రహర్నిశం హి సకలే గాత్రే 1వహత్యుష్ణతా
మంభోజ 2ప్రసవారుణోత్తమ కరా శీతాలయే ప్రేయసీ
సౌరాష్ట్రీచ కళింగదేశయువతిః కామంభవే త్పిత్తలా
హేమంతే శిశిరే నరై 3రవిరతం సేవ్యా యథాకాంక్షయా. 18

తా. శీతలదేశమందలి స్త్రీలు తమశరీరముల నెల్లప్పుడు బట్టలతో కప్పుకొనుచుందురు గాన శరీరమున నుష్ణము కలిగియుండును. వారి చేతులు ఎఱ్ఱతామరపూవులవలె రక్తిమకల్గియుండును. సౌరాష్ట్రి కళింగదేశ స్త్రీలు పిత్తప్రకృతి గలవారగుటచే హేమంత శిశిర ఋతువులలో సంభోగేచ్ఛ కలిగియుందురు గాన నాదినములలో నాస్త్రీలు సంగమమునకు దగియుందురు.

శ్లో. జ్ఞేయా కోకిల కాకలీ కలరవా మేదస్వినీ శీతలా
నిద్రాలుశ్చ శిరీషకోమలతనుః స్నిగ్ధాననా శ్లేష్మలా
వంగ శ్రీహట కామరూప తరుణీ 4శీతాదినా శంకితా
గంతవ్యా శరది ప్రకృష్టమదనా గ్రీష్మే నరై రాదృతా. 19

తా. వంగ సింహళ కామరూప దేశస్త్రీలు కోకిలవంటి కంఠస్వరము మోటుశరీరము శీతలము - అధికనిద్ర - దిరిశెనపువ్వువంటి కోమలము - నున్ననిముఖము - కఫప్రకృతి కలవారై ఆశ్వయుజ కార్తికమాసములలోను గ్రీష్మకాలమందును కామవాంఛ కలవారై యుందురు. గాన నాస్త్రీలతో నాకాలములోనే క్రీడింపవలయును.

శ్లో. శుచిచరిత విచిత్రా చిత్రసంభోగ మిత్రా
నఖదశన విరక్తా శిల్పశిక్షా నురక్తా

1 వహత్యచ్ఛతా 2 ప్రసవారుణోత్పలకరా 3 రనుదినం
4 శీతాదికాలంవినా 4 శీతాదినాసైంధవి

1 స్థిరమతి నిజబంధుః కామసర్వస్వ సింధుః
భవతి రుచిరవేషా కామినీ మధ్యదేశా. 20

తా. మధ్యదేశస్త్రీలు ఆచారముకలవారై ఉజ్జ్వలచరిత్రలై యుండుటయేగాక చిత్రసంభోగానురక్తి - నఖదంతక్షతములయందు విరక్తి - శిల్పశిక్షయం దనురాగము - స్థిరచిత్తము కలిగి కామకళకు సముద్రమువలెనుండి సుందర వస్త్రాలంకారములచే శృంగారించుకొను చుందురు.

శ్లో. కరకుచ కరజాతా శ్లేషవిన్యాస దక్షా
సకలసురత 2బంధుః జ్ఞానసైదగ్ధ్య దక్షా
3నలఘు నగురు వేగా ప్రాయశః కామరక్తా
రమయతి మధురాల్పం సుందరీ 4హాంతగౌడీ. 21

తా. గౌడదేశస్త్రీ నఖక్షత ఆలింగనాదులయందు సమర్థతయు-సమస్తమును సురతక్రియలయందు వాంఛకలిగియుండుట - బుద్ధిమంతురాలై యుండుట - గృహకార్యములయందు నేర్పరితనము-సురతమందు మధ్యవేగము-కామాసక్తి-అల్పసురతమునకే సంతోషపడుట కలిగి యుండును.

శ్లో. మృదువచన విభాగా కోమలానంగ భాగా
విగత రమణభీతిః కోమలానంగగీతిః
ద్రవతి ఝటితి కాన్తా చిత్రసంభోగ 5దక్షా
రమయతి 6కిలకౌలా క్లిరతా వంగగౌడీ. 22

తా. వంగదేశ స్త్రీ కోమలవాక్కులు పల్కుట-మృదువైన కామగృహము-మధురముగ ప్రేమగీతములపాడుట-పతినిజూచి భయపడకుండుట-శీఘ్రముగా ద్రవించుట-చిత్రసంభోగమందు చాతుర్యము కలిగియుండును.

---

పా. 1 స్థితమతి నిజబంధుః 1 స్వసుహృది దృఢరాగా
2 సింధుః 3 నలఘు నబహు 4 తైరభుక్తీ
పా. 5 శాంతా, పా. 6 కిలకాలీ

శ్లో. కరతల హతితుష్టా బాహ్యసంభోగ హృష్టా
చిరనిధువన సాధ్యా మాలవీ ధూర్తవాక్యా
సుఖయతి సుఖవేగా వ్యంజితానంగరాగా
చపల 1పిశున శీలా స్యాదియం చోలబాలా. 23

తా. మాలవదేశస్త్రీ హస్తప్రహారములకు సంతోషించుటయేగాక బాహ్యరతులవలన సంతృప్తిపడును. అనగా నఖక్షత దంతక్షత చుంబనాదులు-అంగాంగసమ్మేళనము-కరస్పర్శనమువలన ఆనందించును. మరియును సురతమున కధికకాలమునపేక్షించుచు ధూర్తవాక్యముల నాడుచుండును. చోళదేశస్త్రీలుకూడ నిట్టిగుణములు గలిగియుండుటయేగాక సంభోగసమయమున మధ్యవేగము కలిగి కామచేష్టలను స్పష్టముగ వెలిబుచ్చుచు చంచలచిత్తము దుష్టప్రకృతి కలవారై యుందురు.

శ్లో. కువలయ దళవర్ణా చారు తాటంకకర్ణా
చకితహరిణనేత్రా ఫుల్లరాజీవ వక్త్రా
లఘునిధువన రక్తా కష్టసంభోగ సక్తా
సులలిత గతిరేఖా 2ఘూర్జరీ చారువేషా. 24

తా. గుజరాతీదేశస్త్రీలు నల్లకలువవలె శ్యామలవర్ణముగల శరీరచ్ఛాయ-అందమైన కర్ణాభరణములు-బెదరిన ఆడులేడి కన్నుల వంటికన్నులు-వికసించిన తామరపుష్పమునుబోలినవక్త్రము(ముఖము) అల్పకాల మైథునమునకు సంతసించుట - సహజ సంభోగాసక్తి-లలితమైన గమనము - సుందరమైన వేషము కలిగియుందురు.

శ్లో. 3అలసవలితదృష్టి ర్దివ్యరూపాంగయష్టిః
కఠిన మదనవేగా దుఃఖసాధ్యా 4ప్రయోగే
విరమతి సురతాంతే కోపమాయాతి 5కాంతే
వివిధ పురుషలోలా సైంధవీ దుష్టశీలా. 25

పా. 1 పిశునలోలా పా. 2 గుర్జరీ

పా. 3 అమలవళితదృష్టి, పా. 4 ప్రయోగా, పా. 5 నిత్యం.

తా. సింధుదేశస్త్రీలు నిద్రిమత్తుతో గూడిన దృష్టి - మంచి రూపము - సుందరశరీరము - సంభోగమునందు ప్రచండవేగము - సురత ప్రయోగమందు దుఃఖసాధ్యురాలుగా నుండుట - సురతాంతమందు విరక్తి - ప్రియునియందు కోపము-అనేకమంది పురుషులయందాసక్తి - దుష్టస్వభావము కలిగియుందురు.

శ్లో. 1పురుష కరజధాత్రీ దుష్టవాక్యా భిధాత్రీ
విషమ సురతపాత్రీ నిశ్చితం కాళగాత్రీ
ఇతి భవతి పురంధ్రీ 2కోసలా 3వంతికాస్త్రీ
కబలయతి రతార్తా శూర్యితే పూర్వ వార్తా. 26

తా. కోసల అవంతిదేశస్త్రీలు పురుషులపై నఖక్షతములను జేయుట-కఠినములైన దుష్టవాక్యముల నాడుట - విపరీత సురతమున క్లిష్టపడుట - రతికాలమందు కామార్తలై పురుషులపై బడియుండు టయు కలిగి యుందురు. కాని చివరచెప్పిన కారణము మాత్రము పూర్వాచారముగా వచ్చుచున్నట్లు వినపడుచున్నది.

శ్లో. 3పికరవ మృదువాచః కోమలాంగ్య స్సురమ్యా
వ్యపగత భయలజ్జా స్సాహసిన్య స్స్వతంత్రాః
లఘునిధువన సాధ్యా 4శ్చీన సౌవీర భేదః
ద్రవిడ మలయజాతాః 5సుందరాంగ్య స్తరుణ్యాః. 27

తా. చీనా, సౌవీర, ద్రవిడ, మలయాళ దేశస్త్రీలు కోకిలా రవమువంటి మధురవాక్యములు - కోమలములై రమ్యములైన శరీర ములు-భయములేకుండుట-నిర్లజ్జ-స్వాతంత్ర్యము - సాహసము - శీఘ్ర సంభోగము-సుందరాంగములు కలిగియుందురు.

---

పా. 1 పులకకరజధాత్రీ; పా. 2 కౌశలావంతికాంధ్రీ
పా. 3 పికవరమృదు పా. 4 స్స్వర్ణసౌదార భేదా, పా. 5 స్తుల్యరూపాస్త రుణ్యః.

శ్లో. సకల సురతదక్షా సిద్ధి1సౌభాగ్య వశ్యా
దశన వసన పాన ప్రీతిభాజః సలజ్జాః
కరజ లిఖన దక్షా శ్చండవేగా భిరమ్యాః
కుసుమ సురభయస్స్యుః మద్ర త్రైలింగ్య నార్యః. 28

తా. మద్ర త్రిలింగదేశముల స్త్రీలు సురతకళలయందు ప్రవీణము కలవారై - కార్యసిద్ధి సౌభాగ్యము గల పురుషులకు వశ్యలై - అధరపాన దంతక్షత నఖక్షతాదులయందు ప్రీతికల్గి - సంభోగమునందు చండవేగము నకు సంతుష్టిపడుచు - పుష్పవాసనవంటి శరీరవాసనకలిగియుందురు.

శ్లో. సురతరస వివర్జ ప్రేమవత్యః ప్రచండాః
కరజదశనకేశాశ్లేష సంజ్ఞా విహీనాః
సహజమలినచిత్తాః పౌండ్రకాంభోజ జాతాః
కరతలలయతుష్టాః కామరూపాంగనాస్స్యుః. 29

తా. పౌండ్రకాంభోజదేశస్త్రీలు * (కాంభోజ అనగా పర్షియాదేశస్త్రీలు) సురతకాలమందు హస్తప్రయోగాదుల నపేక్షించుట - నఖక్షత దంతక్షతాదుల నెఱుంగకుండుట - స్వభావసిద్ధముగ మలిన చిత్తము కలిగియుందురు. కామరూపాంగనలు అనగా అసాముదేశ నివాసినులగు స్త్రీలు కూడ నీగుణములే కలవారై హస్తప్రయోగ కౌశలమునందత్యాసక్తి కలిగియుందురు.

శ్లో. గాఢం సంశ్లిష్య కంఠే లిఖతి కరరుహైః స్సర్వతః కాంతదేహం
కేశేష్వాకృష్య చుంబత్యధర మవిరతం ముష్టిఘాతం దదాతి
తృప్తిం నోయాతి శీఘ్రంద్రవతి నచరతే చండవేగా ప్రగల్భా
జ్ఞాతవ్యా పండితేంద్రైః 2రతికలిత రతి ర్లాట కర్నాటనారీ. 30

---

1 సౌభాగ్యదక్షా 2 రతిలలిత

* అమరకోశములో "వనాయుజాః పారసీకాకాంభోజాబాహ్లికాహయాః" అని యుండుటవలన అందుదహరింపబడిన దేశపు గుఱ్ఱములనుగూర్చి యర్థమిచ్చు చున్నను కాంభోజదేశమందు పుట్టిన మనుష్యులకు గూడ కాంభోజనామముమీద వ్యవహరింపబడుదురు.

తా. లాట కర్ణాట దేశస్త్రీలు ప్రియులయొక్క కంఠమునందు నఖక్షతములు చేయుట - శరీరమునంతయు దృఢాలింగన మొనర్చుకొనుట - శిరోజములను గ్రహించి అధరపాన మొనర్చుట - ఎల్లప్పుడు పురుషునితో సమముగ ముష్టిఘాతములు చెంపపెట్లనిచ్చుట - సంభోగమునందు చండవేగము - తృప్తిలేకుండుట శీఘ్రముగా ద్రవింపకుండుట - అధికముగా ఎదురొత్తులిచ్చుటయు గలిగియుందురు.

శ్లో. దుష్టా దుర్గంధదేహాః పశుసమసురతాః చుంబనా శ్లేషహీనాః
స్త్వస్త్యా మ్లేచ్ఛాంగనాస్యు ర్లఘురతనిరతాః పార్వతీయాశ్చ నార్యః
1కాశ్మీరాభీరగంధ్యాః సకలరసకలా 2మోదదక్షా నితాంతం
సాధ్యా దేశానుసారా దిహపటుమతిభి ర్యోషితస్సర్వదైవ. 31

తా. మ్లేచ్ఛాంగనల దేహములు దుర్గంధయుక్తములై యుండును. మఱియు నాస్త్రీలు దుష్టహృదయులు రతికాలమున పశువువలె ప్రవర్తించుట - ప్రచండవేగము నపేక్షించుట - ఈర్ష్యాళువులై యుండుటయేగాక ప్రేమాలింగనములు చుంబనముల నెరుంగరు. పర్వతప్రాంత స్త్రీలు నిట్టిగుణములనే కలిగియుందురు గాని సురతమందు మధ్యవేగము నపేక్షింతురు. కాశ్మీరదేశస్త్రీలు నఖ, దంతక్షత, ఆలింగనాది సకలరతికళల యందు నేర్పరులై - ఆమోద ప్రమోదములయందు నిపుణులై యుందురు. గాన చతురులగు పురుషులు దేశకాలములను గుర్తెరింగి కార్యసాఫల్యము నందవలయును.

శ్లో. జాతే స్తత్త్వం సమస్తం నిఖిల శశికలా బోధనం సత్త్వవృత్తిం
మృగ్యాదీనాం వశత్వం మదనరసకలా కౌతుకం చాప్యశేషం
ఇత్థం యః కామినీనాం కలయతి చరితం దేశసాత్మ్యేన సమ్యక్
3యావజ్జీవం సతస్యాః ప్రభవతిహృదయే ప్రాణనాథస్సుఖాయ.32

---

1 కాశ్మీరాభీరమధ్యా 2 మోదహంత్రీ

3 యావత్తావత్సతస్యాః

తా. స్త్రీజాతియొక్క తత్త్వమును చంద్రకళాప్రదీపన విధానము దేవసత్త్వాది సత్వలక్షణము - మృగిమొదలగు నాయికలను వశముజేసికొనుట కామకళకు సంబంధించిన సమస్తానుభవ పూర్వకజ్ఞానము దేశరీతుల ననుసరించి ఆయాస్త్రీలయొక్క చరిత్రము ఈ సాయకమునందు చెప్పబడినవి. సజ్జనులైనవారు దీనిని సదుపయోగముచేసి స్త్రీలకు యథార్థమైన సౌఖ్యమునిచ్చి ప్రీతిభాజనులై ప్రాణనాథులను పేరు సార్థకపరచుకొందురుగాక.

—: యోనిస్వరూపలక్షణము :—

శ్లో. స్పర్శేన పంకజసమా తరుణీజనానాం
అభ్యంతరేచ గుటికా [1]సమదేశికాచ
యోనిర్భవే దథ వలిప్రక[2]రావకీర్ణా
గోజిహ్వికా [3]సుఖర కర్కశ గర్భ[4]దేశా. 33

తా. స్పృశించిన మాత్రమున తామరమొగ్గవలె సుందరమై కోమలమై యున్న యోనిని పంకజసమా అని పల్కుదురు. (రెండవది) యోనిమధ్యమున గుటికవలె నుండుటచేత నాభగమును సమదేశికా అనిపచింతురు. (మూడవది) ముడతలుగల వర్తులాకారముగా నుండును గనుక వలిప్రకారావకీర్ణా అని వచించెదరు. (నాలుగవది) ఆవునాలికవలె కర్కశమై కఠినమైన మధ్యప్రదేశముగల యోనిని గోజిహ్వికా అనియు స్త్రీ భగములు నాలుగువిధములుగా నుండునట్లు చెప్పియున్నారు.

—: యోనియొక్క ఉత్తమమధ్యమాధమ నిరూపణము :—

శ్లో. [5]అత్యుత్తమా ప్రకథితా ప్రథమా కవీంద్రైః
మధ్యాచ మధ్యమవిధా ఖలుసంప్రవిష్టా
శేషద్వయం మదనకేళి కళారసజ్ఞైః
నింద్యం సదైవ కథితం సురతోత్సవేషు. 34

1 సమఏవకోఽపి 2 రావకీర్ణో 3 సుఖద 4 దేశః
5 అత్యుత్తమఃపరికథితఃప్రథమఃకవీంద్రైః మధ్యశ్చమధ్యమవిధఃకిలసంప్రదిష్టః పుంలింగ ఏకవచనముగా వ్రాయబడిన పాఠాంతరమిది.

తా. స్త్రీ జననేంద్రియము నాలుగువిధములని చెప్పనిర్ణయింపబడినది. దానిలో మొదటచెప్పబడిన 'పంకజసమా' అనునది ఉత్తమము. రెండవదిగా నిరూపింపబడిన 'సమదేశికా' అనునది మధ్యమము. మిగిలినవి రెండు అనగా 'వలిప్రకారావకీర్ణా - గోజిహ్వికా' అనునవి రతికినింద్యములని రతికళావేత్తలు పల్కుచున్నారు.

శ్లో. వహ్నిర్నశాంతి ముపయాతి కదాపి కాష్ఠైః
నాంభోనిధి ర్విరమతి ప్రచురైః పయోభిః
నాప్యన్తకో జగతి జంతుభి [1]ర్నైతితోషం
వామాపి నైవ పురుషైః ఖలు [2]యాతి తృప్తిం. 35

తా. ఎన్నికట్టెలను బడవైచినను అగ్నిహోతుడు (యే విధముగ తృప్తిజెందడో ఎన్నినదులు కలిసినను సముద్రమెట్లు సంతృప్తిని వహింపడో జీవకోట్ల నెంతబాధించినను యముడెట్లు విరమింపడో అదే విధముగ స్త్రీలు పురుషసంగమమువలన సంతృప్తిని పొందరు.

శ్లో. తస్మాన్నరేణ [3]రతిరంగ విచక్షణేన
మాయాముపాస్య సకలాం స్వశరీరసాధ్యాం
తాసాం మనోహరణమేవ పరంవిధేయం
నోవేదకోపి హృదయం కిము కామినీనాం. 36

తా. అందువలన రతికళానేత్రులైన పురుషులందరు తెలిసికొనవలసిన దేమనగా తమశరీరశక్తిని రసజ్ఞతను తెలిసికొని స్త్రీలను రంజింపజేయు సమర్థతకలదో లేదో విచారించుకొని కార్యక్రమమున కుపక్రమింపవలెను. కారణమేమనగా స్త్రీలయొక్క హృదయరహస్యము నెవ్వరును గుర్తింపజాలరు.

—: నైసర్గిక ప్రీతిలక్షణము :—

శ్లో. నాభ్యాసతో నచభవేద్విషయాభిమానా
జ్జన్మాంతరీయసహజా పురుషస్యనార్యా

---

1 రేతితృప్తిం 2 యాతితోషం
3 రతిరాగ

ప్రీతిః పరస్పరతయా హృదయావస్థా
నైసర్గికీతి కథితా కవిశేఖరేణ. 37

తా. అభ్యాసమువలనగాని విషయాభిమానమువలనగాని ఏర్పడక జన్మాంతరసంబంధముకలిగి సహజమై స్త్రీ పురుషులిరువురు పరస్పరము ప్రేమించుకొనిన నది నైసర్గికప్రేమ యనబడును.

—: ప్రీతిభేదనిరూపణము :—

శ్లో. స్రక్చందనాంబరమనోహరభక్ష్యభోజ్యై
ర్నానావిధై రుపచితా విషయై స్తథైవ
ప్రీతి స్స్మృతా విషయజేతి కవిప్రవీణైః
సాదృశ్యయోగసుభగా కథితా[1]సదైవ. 38

తా. పుష్పమాలలు మంచిగంధము - వస్త్రములు-మధురము లైన భోజనపదార్థములు మొదలగు వస్తువులద్వారా సంభవించిన ప్రీతి విషయజ మని చెప్పబడును. ఈవిధముగ స్త్రీ పురుషులిర్వురు పరస్పర ముపయోగించుకొనినచో సమానప్రేమ కలుగును.

—: ఆభ్యాసకీ లక్షణము :—

శ్లో. ఆఖేట శిల్ప సురపూజన కేలిరంగ
స్సంగీతసేవన విధా వ్యుపచీయతే యా
అభ్యాసకౌశల వశేన కృశోదరీణాం
ఆభ్యాసికీ నిగదితా కవిభిః పురాణైః. 39

తా. వేట-శిల్పకళ.దేవపూజ-కేళీరంగము-సంగీత విద్యాభ్యాస మొనర్చుట మొదలగు వానివలన గలిగినప్రీతి ఆభ్యాసికప్రీతియని ప్రాచీనకవులు చెప్పియున్నారు.

—: అనురాగ వినాశనహేతు నిరూపణము :—

శ్లో. దారిద్ర్య దుఃఖ భయ విక్లవ [2]మాన రోగ
రుద్వేగ కోప తనుతాదిభి రీశ్వరాణాం

---

1 సమాచ

పా. 2 గాత్రరోగై

రాగం త్యజంతి వనితాఇహ వి_స్తరస్య
భీత్యా నచాస్య కథిత స్సకలో వివ_ర్తః. 40

తా. నిందుయవ్వనములో దారిద్ర్యమువలన స్త్రీలకు కష్టము కలిగినను - పరులవలన భయము సంభవించినను - భ_ర్త రోగపీడితుడై నను - ఎవరికైన మిక్కిలి పీడగల్గుటవలనను - ప్రభువు కోపించినను స్త్రీలు అనురాగమును వదలుచున్నారు. ఈవిషయములో చెప్ప వలసిన దధికముగా నున్నను గ్రంథవి_స్తరభీతిచే నుదహరింపబడలేదు.

ఇతి శ్రీ కవిశేఖర జ్యోతిరీశ్వర నృపతివిరచితే
పంచసాయకే ద్వితీయః సాయకః.



శ్రీరస్తు.

# పంచసాయకము.

## — తృతీయ సాయకము —

### — దేహదుర్గంధహరణయోగము —

శ్లో. ప్రాగంగరాగః పురుషేణకార్యః
స్త్రియా చ సంభోగసుఖాయ 1గాత్రే
తస్మాదహం గంధవిధానమాదౌ
విలాసినః సర్వముదీరయామి. 1

తా. సంభోగసుఖమును బాగుగా పొందుటకై స్త్రీ పురుషులు ముందుగా తమతమ అవయవముల నన్నింటిని శుభ్రముగను సుగంధపరిమళములతో నిండునట్లుగ నుంచుకొనవలయును. అందుకై నేను విలాసవంతులగు స్త్రీపురుషులకై సుగంధవిధానమును దెల్పుచున్నాను.

శ్లో. 2హారీతకీ లోధ్రమరిష్టపత్రం
3సహ్స్తచ్ఛదో 4దాడిమకల్కకంచ
ఏషోంగనాయాః కథితః కవీంద్రైః
శరీర దౌర్గంధ్యహరః ప్రలేపః. 2

తా॥ కరక్కాయ - లొద్దుగచెక్క - కుంకుడుఆకు - ఏడాకుల పొన్నఆకు - దానిమ్మచెక్క వీనిని నూరి శరీరమునందు లేపనము చేసిన యెడల శరీరదుర్గంధము పోవును.

శ్లో. హారీతకీ చందన ముస్తనాగ
రుశీర 5లోధ్రామయ 6రాత్రితుల్యైః
స్త్రీపుంసయో ర్ఘర్మజగాత్రగంధం
వినాశయత్యాశు 7విలేపనంచ. 3

---

1 రాత్రౌ
2 సఘాతకీలోధ్ర, 3 సచందనం, 4 దాడిమ వల్కలంచ.
5 లోధ్రోత్పల, 6 రాత్రిమూలైః, 7 విలేపనేన

తా॥ కరక్కాయ - శ్వేతచందనము - నాగముస్తలు - వట్టివేరు లొద్దుగచెక్క - నల్లకలువ వీనిని సమానభాగములుగా దంచి పొడిచేసి లేపనము చేసినయెడల స్త్రీ పురుషులకు చెమటవలన కలిగిన శరీర దుర్గంధము పోవును.

శ్లో. హరీతకీ శ్రీఫల ముస్త 1యుక్తైః
2బింబీఫలైః పూతికరంజబీజైః
కక్షాది దౌర్గంధ్య 3మతిప్రభూతం
వినాశయత్యాశు హరేనయోగః. 4

తా. కరక్కాయ - మారేడు-తుంగముస్తలు-దొండపండు-నేల మడుగుచెట్టుగింజలు నూరి లేపనమొనర్చినయెడల చంకలు మొదలగు అవయవములయందలి దుర్గంధము పోవును.

శ్లో. సచందనోశీరక బిల్వపత్రైః
కోలాక్షమజ్జాఽగురు నాగపుష్పైః
లిప్త్వాశరీరం 4ప్రమదా జవేన
చిరప్రరూఢం వినిహంతి గంధం. 5

తా. చందనము - వట్టివేరు - మారేడుఆకులు - రేగుగింజలోని పప్పు - తాడికాయలోనిపప్పు - కృష్ణాగరు - నాగకేసరములు నూరి లేపనము చేసినయెడల స్త్రీలకు చిరకాలమునుండి పోని దుర్గంధము నాశన మగును.

శ్లో. 5సదాడిమత్వఙ్మధు లోధ్రపద్మైః
పిష్టైస్సమానైః పిచుమందపత్రైః
విలిప్యగాత్రం తరుణీ నిదాఘే
6దౌర్గంధ్యకం ఘర్మభవం నిహంతి. 6

1 యుక్తం, 2 చించాఫలంపూతికరంజబీజం, 3 మపిప్రభూతం
4 ప్రమదాహవేన
5 హరీతకీత్వక్, 6 దుర్గంధిఘర్మాపచయం

తా. దానిమ్మచెట్టుయొక్క పట్ట - (చర్మము) - ఇప్పపువ్వు-లొద్దుగచెక్క - తామరగింజలు - సమాన భాగములుగా పిండిచేసి వేపాకురసములోకలిపి స్త్రీ తనశరీరమునకు లేపనము చేసినయెడల ఎండాకాలమందలి చెమటవాసన అంతయుపోవును.

శ్లో. సకేసరోశీర శిరీష లోధ్రై
శ్చూర్ణీకృతై రంగవిలేపనేన
గ్రీష్మేనరాణాం న [1]కదాచిదేవ
ధర్మప్రసుతిస్యాదితి భోజరాజః. 7

తా. నాగకేసరములు - వట్టివేరు - దిరిశన - లొద్దుగచెక్క-వీటిని దంచి చూర్ణముచేసి శరీరమునకు లేపనము చేసినయెడల ఎండాకాలమందు చెమట శరీరమునుండి రాదని భోజరాజు చెప్పినవాక్యము

—: మహాసుగంధి తైలము :—

శ్లో. ఆదౌ బిల్వదళం తతో మరువకం పుష్పాణ్యశోకస్య తు
ప్రిత్యాదిత్య మజస్రమేవ [2]తిలజే తైలేఘటే నిక్షిపేత్
కేతక్యాః కుసుమానిచేహ ముహుశః శేషే క్షిపేదాదరాత్
ఇత్థం కార్యమిదం మహాపరిమళం తైలం నరైః సిద్ధయే. 8

తా. ప్రథమమున మారేడుఆకులు - తదుపరి మరువము - అశోకపుష్పములు-నువ్వులనూనెతో నిండిన కుండలోవేసి ఉదయము నుండి సాయంత్రమువరకు ఎండలోనుంచి తదుపరి మొగలిపువ్వులువేసి నాననిచ్చినయెడల మహాసుగంధితైలమేర్పడును. ఇది చాల లాభకరము.

—: స్నాన సమయ సుగంధ ద్రవ్యము :—

శ్లో. స్వర్ణాంబుదోశీరమసీయుతానాం
పథ్యాన్వితానాం చ విలేపనేన

---

1 కదాపిదేహే=కదాపిదోషః

పా. 2 హవిషా త్రోటి స్తరాం నిక్షిపేత్.

1స్నాత్వా సరః సౌరభమేవ 2మాసా
చ్చైచ్చకర్క్యా మాప్నోతి 3శిరోరుహాణాం. 9

తా. పచ్చనాగము స్తలు - వట్టివేరు - జటామాంసి - కరక్కాయ - వీటిని సమభాగములుగానూరి లేపనముగాచేసి స్నానమునకుపూర్వము తలకు లేపనమొనర్చుకొని స్నానము చేయవలయును. నెలదినములిట్లు చేసినయెడల శిరోజములు నునుపుగా బారుగాపెరుగును. మరియు పరిమళముగానుండును.

—: అంగసౌరభవిలేపనం :—

శ్లో. పథ్యారసాలామలకీ ఫలానాం
సజంబు జీమూత దళోత్పలానాం
మాంసీయుతానాం పరిలేపనేన
స్నాయాన్నరః సౌరభకాంతివృద్ధ్యై. 10

తా. చిత్రికూరరసము - ఉసిరికాయ - నేరేడుపండు - దేవ తాళమువృక్షముయొక్క దళము - నల్లకలువ - జటామాంసి - వీటిని కలిపి సువాసనకొరకు కాంతికొరకు శరీరమునకు లేపనమొనర్చుకొని, స్నానమొనరింపవలయును.

శ్లో. హరీతకీ తోయద తుల్యభాగై
ర్వనేచరస్యాపి చతుర్థభాగః
తదర్థభాగః కథితో నఖస్య
స్యాదేషగంధో మదనప్రకాశః. 11

తా. కరక్కాయ - తుంగముస్తలు - సమాన భాగములుగా జేసి వానిలో నాలుగవవంతు బ్రహ్మమేడి; దానిలో సగభాగము వ్యాఘ్రనఖమను సుగంధద్రవ్యము, వీటిని లేపనమొనర్చుకొనిన కామోద్దీపనముకలుగును.

పా 1 కృత్వా, 2 మాసాం, 3 శిరోరుహస్య.

శ్లో. ఏలా శటీ పత్రక చందనాని
తోయా భయా చంద్ర 1ఘనోత్పలాని
ససారభోఽయం సురరాజయోగ్యః
ఖ్యాతః సుగంధో 2నరమోహనాఖ్యః. 12

తా. ఏలకులు - కచ్చూరము - ఆకుపత్రి - చందనము - తుంగముస్తలు - కరక్కాయ - కర్పూరము - లవంగచెక్క - చెంగల్వకోష్టు - సమభాగములుగా పొడిచేసియుంచిన దానిపరిమళము అత్యుత్తమమై నరమోహనకరమైయుండును.

శ్లో. ఏణేయ కాశ్మీర ఘనాఽమ్బులోధ్ర
నిశాకరోశీర సమాని పిష్ట్వా
లేపః ప్రియోఽయం సురమానవానా
ముదీరితః పూర్వ3కవీంద్రవర్యైః. 13

తా. కస్తూరి-నాగకేసరములు-నాగముస్తలు - భద్రముస్తలు-లొద్దుగ -కర్పూరము - వట్టివేరు - వీనిని సమానభాగములుగా నూరి లేపనము చేయవలయును.

ఈలేపనము మానవులకేగాక దేవతలకుగూడ ప్రియమైనదని పూర్వకవులచే చెప్పబడినది.

శ్లో. ఉశీర కృష్ణాగురు చందనాని
పత్రాంబుతుల్యాని 4ఘనాని పిష్ట్వా
ఏతాని గాత్రేషు విలాసినీనాం
శ్రీఖండతుల్యం కథయంతి గంధం. 14

తా. వట్టివేరు-కృష్ణాగరు-చందనము వీనిని - సమానభాగములుగా నూరి సుందరస్త్రీల శరీరమందు లేపనమొనర్చినయెడల హరిచందనముతో సమానమైన సుగంధము కలిగియుండును.

---

పా. 1 ఘనామయాని, 2 నరమోహనార్థః
3 కవీంద్రైర్వీరైః
4 సమానిపిష్ట్వా

శ్లో. జాతీ కర్కాట రక్తచందన ఘన శ్రీవాస శైలేయకం
కస్తూరీకనకం మతంగకుసుమైః స్థౌణేయకః సంయుతం
ఏతానీందుయుతాని పర్ణ1జరసైః పిష్టోంగరాగః శుభః
కార్యోగంధకలాకలాపకుశలైః క్షోణీంద్రయోగ్యఃసదా. 15

తా. జాపత్రి - కర్కాటకశృంగి - రక్తచందనము - నాగముస్తలు - శ్వేతచందనము - అడవిసదాప - కస్తూరి - నాగకేసరములు స్వర్ణమాలతి - మాచిపత్రి - వీనిని కర్పూరముతో కలిపి తమలపాకు రసముతో కాని మరువకపత్రములతో గాని నూరినయెడల శరీరలేపనమునకు పనికివచ్చును. ఇది మహారాజ యోగ్యమైన అంగరాగము.

శ్లో. పథ్యాభాగచతుష్టయం జలముచో భాగైకమాత్రంమతం
2వ్యాధేర్భాగచతుష్టయం చ శశినః స్థౌణేయభాగద్వయం
భాగాఃపంచ 3శిలోద్భవస్య కథితా భాగోనఖస్యాపి చ
కస్తూరీదళసంజ్ఞకం నిగదితం సౌరభ్యవిజ్ఞైరిదం. 16

తా. కరక్కాయ నాల్గుభాగములు - నాగముస్తలు ఒక భాగము - చంగల్వకోష్టు నాల్గుభాగములు - కర్పూరము నాల్గు భాగములు - మాచిపత్రి రెండుభాగములు - మణిశిల నాల్గుభాగములు - నఖ (నఖమను సుగంధ ద్రవ్యము) కస్తూరి వీనిని కలిపి నూరినయెడల కస్తూరీదళమను పేరుగల విలేపనమగును.

శ్లో. పథ్యాభాగచతుష్టయం జలముచో భాగైకమాత్రం సదా
శ్రీఖండాగురుజాతికా మృగమదస్యోకైకాశ్చ భాగాస్త్రయః
మాంసీపద్మతుషార వాలకసమైః సమ్యక్ క్రియాపేషితః
సర్వైరేభిరిహోత్తమః ప్రకథితః సౌరభ్యగర్భాభిదః. 17

తా. కరక్కాయ నాల్గుభాగములు - నాగముస్తలు ఒక భాగము - హరిచందనము - అగరు - జాపత్రి - కస్తూరి - మూడు

1 నురసైఃపిష్టాంగ రాగః
2 జాత్యాభాగయుతం తథైవ, 3 శిలాశ్మకస్య

భాగములు - జటామంసి - పద్మాక్షులు - పుష్కరమూలము - కురు వేరు సమభాగములుగా - వీనిని నూరి కలిసి లేపనముతయారు చేసి న-చో సర్వో త్తమసుగంధయోగము.

శ్లో. రసాల జంబూఫల గర్భసారః
సకర్కటో మాక్షికసంయుతశ్చ
స్థితో ముఖాంతే పురుషస్య రాత్రౌ
కరోతి 2సౌరభ్యసుఖం ముఖస్య. 18

తా. మామిడి-నేరేడుపండ్లరసము -కర్కాటకశృంగి-తేనె వీనిని కలిపి సమ్మేళనముచేసి రాత్రిపరుండువేళ నోటిలో నుంచుకొనిన-చో ముఖమునకు పరిమళము కలుగును.

శ్లో. గుడత్వగేలా నఖజాతికాహ్వైః
స్వర్ణాన్వితైః క్షుద్రవటీ విధేయా
తాంబూలగర్భా దివసే చ రాత్రౌ
కరోతి పుంసాం ముఖవాసమిష్టం. 19

తా. దాల్చినచెక్క - ఏలకులు-నఖమనే సుగంధ ద్రవ్యము - జాపత్రి - స్వర్ణమాలతి - వీనిని కలిపినూరి చిన్నచిన్న మాత్రలుగా చేసి తాంబూలముతోగూడ సేవించిన-చో రాత్రి పగలు కూడా ముఖము పరిమళముగానుండును.

శ్లో. యఃకుష్ఠచూర్ణం మధునా ఘృతేన
పికాక్షబీజాన్వితమత్తి నిత్యం
మాసైకమాత్రేణ ముఖం తదీయం
గంధాయతే కేతకి పుష్పతుల్యం. 20

తా. చెంగల్వకోష్ఠుచూర్ణము - తేనె - నెయ్యి-గొబ్బిగింజలు - కలిపి నెలదినములు తప్పక సేవించిన-చో ముఖము మొగలిపువ్వవలె పరిమళించును.

---

2 (గ) ప్రతిలో " సౌరభ్యమయ " అనియు " సౌరభ్యమసౌ " అనియు పాఠాంతరములు కలవు.

—: వాజీకరణప్రయోజనము - అందుకు తగిన ఔషధములు :—

శ్లో. బలేన నారీ పరితోషమేతి
నహీనవీర్యస్య కదాపిసౌఖ్యం
అతో బలార్థం రతిలంపటస్య
1బీజాభిధానం ప్రథమం విదధ్యాత్. 21

తా. స్త్రీలు రతికాలమందు తగిన బలప్రయోగమువలన సంతసింతురు. దుర్బలునివలన స్త్రీ సంతుష్టిచెందదు. అందువలన శరీరమునకు ధాతుపుష్టి బలము వృద్ధియగుటకై వాజీకరణ ఔషధములను సేవించుటావశ్యకము. వాజీకరణశబ్దమునకు తాత్పర్యమేమనగా సంభోగసమయమున గుఱ్ఱముయొక్క బలమునీయగల ఔషధమునకు వాజీకరణమనిపేరు. ఎక్కువ సంభోగ వాంఛగల పురుషులీ వాజీకరణ ఔషధములను సేవింపవలయును.

—: విదారీచూర్ణము :—

శ్లో. చూర్ణం విదార్యాః సర్వసేన తస్యాః
2సంభావితం భాస్కర రశ్మిజాలే
మధ్వాజ్య సమ్మిశ్రితమాశులీడ్వా
దశస్త్రియో గచ్ఛతి నిర్విశంకః. 22

తా. నేలగుమ్మడిచూర్ణమును - నేలగుమ్మడి రసముతో - భావనచేసి ఎండలో రెండుజాములవేళ ఎండనిచ్చి నూరి తేనె - నెయ్యి - కలిపి సేవించినయెడల పదిమంది స్త్రీలతో భోగించుటకు తగిన శక్తికలవాడగును.

—: ఆమలకచూర్ణము :—

శ్లో. భూయో విభావ్యాఽమలకస్యచూర్ణం
3రసేన తస్యైవ సితాజ్యమిశ్రం
సక్షౌద్రమాలేఢి నిశాముఖే యో
నూనం స వృద్ధస్తరుణత్వమేతి. 23

పా. 1 బీజాభివృద్ధిం, 2 సుభావితం, 3 రసేచతస్యైవ

తా. ఉసిరికాయపొడిని - ఉసిరికాయ రసముతో తడిపి - ఎండబెట్టి పటికబెల్లము - తేనె - నెయ్యి - కలిసి రాత్రి మొదటి జామునకు అనగా తొమ్మిది గంటలకులోపుగా సేవించినయెడల వృద్ధుడైనను పడుచువాడగును.

—: శతావర్యాదిచూర్ణము :—

శ్లో. శతావరీ వానరి గోక్షురాణాం
గోరక్ష మాతంగబలాబలానాం
క్షీరేణ చూర్ణాని నిపీయ రాత్రౌ
మథ్నాతిదర్పం తరుణీజనస్య. 24

తా. పిల్లిపీచర - సన్నపల్లేరు - పెద్దదూలగొండి విత్తులు - ముత్తువపులగము - మాతంగబల (ముత్తువపులగములోని భేదము) వీనియొక్క చూర్ణమును పాలతో కలిపి రాత్రులు త్రాగినచో మదించిన స్త్రీలయొక్క గర్వమును పోగొట్టగలడు.

శ్లో. మోవర్తకీ లావకపింజలానాం
మాంసం తథా వేశ్మ విహంగమస్య
1హవ్యేనసిద్ధం సహ సైంధవేన
మహాబలస్స్యా దుపభుజ్యనూనం. 25

తా. వెలిచెపిట్ట - లావుకపిట్ట - తీతరపక్షి - పావురము - వీనిమాంసమును నేతితో కలిపి సిద్ధిచేసి భక్షించినయెడల మహాబలవంతుడగును.

శ్లో. శతావరీ గర్భమిదం సమర్పిః
పచేత్పయోభిర్దశభాగయుక్తైః
సితోపలాభ్యాం మధుసంప్రయుక్తం
నాస్మాద్ద్వితీయం భువి దృష్టమస్యత్. 25

తా. పిల్లిపీచరచూర్ణమును నేతిలో కలిపి అంతకు పదిరెట్లు పాలలో ఉడకబెట్టి సితోపలాదిచూర్ణముతో కలిపి తేనెతో పుచ్చు

1 ఆజ్యేన

కొనినయెడల మంచిశక్తి కలుగును. ఇటువంటి వాజీకరణౌషధము వేరులేదు.

శ్లో. సితసికతరుబీజం తండులాః షష్ఠికానాం
సఘృత మధుసమేతం ప్రత్యహం యోఽవలేఢి
జఠరకుహరమధ్యే యాతి యావన్న పాకం
రమయతి కృశదేహోప్యంగనానాం సమూహం. 27

తా. గొబ్బిగింజలు - రెండు నెలల పంటలో తయారైన బియ్యపుపిండ - నెయ్యి - తేనెలో కలిపి ప్రతిదినము సేవించినచో దుర్బలుడుకూడ బలవంతుడగును.

శ్లో. మాంసీం విదారీం చ తథోచ్చటాం చ
క్షీరే గవాం క్షౌద్ర ఘృతోపపన్నం
పీత్వా నరః శర్కరయా సుయుక్తాం
కులింగవద్ధృష్యతి సర్వ1రాత్రి. 28

తా. జటామాంసి - నేలగుమ్మడి - ఆరేసిపాళ్లు తెల్లగురి వింద ఒకపాలు- బుడమకాయ ఆరుపాళ్లు వీటిని నలగగొట్టి ఆవుపాలు తేనె - నెయ్యి - యీ మూడింటితో కలిపి పంచదారతో పుచ్చు కొనినయెడల శరీరమునకు మితిలేని బలమునిచ్చును.

శ్లో. లఘుశాల్మలిమూలేన తాలమూలీం సుచూర్ణితాం
సర్పిషా పయసా పీత్వా రతౌ చటకవద్భవేత్. 29

తా॥ లేతబూరుగయొక్క మూలముతో నేలతాడిని రోకలి పోటుతో నలుగగొట్టి చూర్ణముచేసి నెయ్యి పాలతో కలిపి రాత్రులు త్రాగినయెడల సంభోగకార్యమందు పిచ్చుకవలె మాటిమాటికి సంగమముచేయ సమర్థుడగును.

శ్లో. వృద్ధశాల్మలిమూలస్య రసం శర్కరయా పిబేత్
ఏతత్ప్రయోగాత్సప్తాహా జ్జాయతే రేతసోంబుధిః. 30

1 రాత్రిం

తా. పెద్దబూరుగవేరురసములో పంచదార కలిపి వారము దినములు త్రాగినయెడల వీర్యవృద్ధి అధికమగును.

—: యోని సంకోచ విధి :—

శ్లో. ప్రౌఢాంగనాయా నవసూతికాయాః
శ్లథం వరాంగం న సుఖాయ[1]యూనాం
తస్మాన్మనుష్యై ర్భేషజతోవిధేయా
గాఢక్రియా మన్మథమందిరస్య. 31

తా. ప్రౌఢయొక్కయు నూతనప్రసూతయైన స్త్రీ యొక్కయు మదనగృహము శిథిలమై యుండునుగనుక యువకులకు సంతోషకరముకాదు. అందువలన ఆయుర్వేదీయ ఔషధములద్వారా కామగృహమును సంకుచితముచేయవలయును.

శ్లో. నిశాద్వయం పంకజకేసరంచ
నిష్పిష్య దేవద్రుమ తుల్యభాగం
అనేన లిప్తం మదనాతపత్రం
ప్రియాతి సంకోచమలం యువత్యాః. 32

తా. పసుపు - మానుపసుపు - పద్మకేసరములు- దేవదారు వీనిని సమానభాగములుగా కలిపి లేపనమొసర్చినయెడల స్త్రీల భగములు సంకుచితమై బిగువుగానుండును.

శ్లో. సధాతుకీ పుష్ప ఫలత్రికేణ
జంబుత్వచా సార[2]ఘసంయుతేన
లిప్త్వా వరాంగం మధుకేన తుల్యాం
వృద్ధాపికన్యేవ భవేత్పురంధ్రీ. 33

తా॥ ఆరెపువ్వులు - త్రిఫలములు - (కరక-తాడి-ఉసిరి,) నేరేడుపట్ట-తేనె - యష్టిమధుకము - వీనిని కలిపి లేపనముచేసినయెడల వృద్ధకామినియు కన్యవలెనగును. అనగా భగము బిగువుగానుండును.

పా. 1 నిత్యం
పా. 2 సారసైర్యతేన (పాఠాంతరములో అక్షరములోపించినది)

శ్లో. పికాక్షబీజేన మనోజగేహం
విలిప్య యోషానియమం చరంతీ
హాతేన గాఢం లభతే 1వరాంగం
దృష్ట్వా న్నరై రేష సదైవ యోగః. 34

తా. గొబ్బిగింజలునూరి కామగృహమునకు లేపనముచేసి ఒక వారముదినములు నియమముగానున్నయెడల వరాంగము దృఢముగ నుండును.

శ్లో. 2యా శక్రగోపం స్వయమేవ పిష్ట్వా
3విలింపతి స్త్రీ కుసుమేషువేశ్మ
4ఆహత్య కాఠిన్య మలంచ గాఢం
భవేచ్చ నాత్రాస్తి 5వికల్పశంకా. 35

తా. ఆరుద్రపురుగును స్వయముగ నూరి ఋతుకాలమందు మదనగృహమునకు లేపనమొనర్చిన-చో కామగృహము సంకుచితమై దృఢమగును.

శ్లో. ఇందీవరవ్యాధి 6వచోషణానాం
తురంగగంధా 7ద్వయయామినీనాం
లేపేసనార్యాః స్మర వేశ్మరంధ్రం
సంకోచ యత్యాశు హాతేనయోగః. 36

తా. నీలకమలము - చెంగల్వకోష్టు - పిప్పలి - అశ్వగంధి - (పెన్నేరిగడ్డ) నూరి లేపనముచేసినయెడల వరాంగము సంకుచిత మగును.

శ్లో. మదనకఘనసారైః క్షౌద్రితుల్యైర్వరాంగం
శిథిలితమపి యస్యాః పూరితం భూయఏవ
భవతికఠినముచ్చైః కర్కశం కామినీనాం
ఇతినిగదతియోగం రంతిదేవోనరేంద్రః. 37

పా. 1 తదంగం, పా. 2 సాశక్రగోపం, 3 లింపేత్ స్వకీయం కుసుమేషువేశ్మ, పా. 4 ఆహస్మృతస్యాః కఠినంచ గాఢం, 5 వికల్పసత్తా
పా. 6వచాకణానాం, 7 రజనీద్వయానాం

తా. మంగచెట్టువేరు - లేక మానుచెక్క రసము - కర్పూరము - తేనె - మూడును కలిపి లేపనము చేసినయెడల శిథిలమైనయోని దృఢమై కఠినమైనదగునని రంతిదేవుడు చెప్పెను.

—: ద్రావణయోగములు :—

శ్లో. యద్యప్యష్టగుణాధికో నిగదితః కామోంగనానాం సదా
నోయాతి ద్రవతాం తథాపి ఝటితి వ్యాయామినాం సంగమే
తస్మాద్భేషజ సంప్రయోగవిధినా సాక్షేపతో ద్రావణం
1కించిత్పల్లవయామి పంకజదృశాం ప్రత్యాయకం కామినోః. 38

తా. పురుషులకన్న స్త్రీలకు కామము ఎనిమిదిరెట్లు అధికమని శాస్త్రములు చెప్పుచున్నవి. బలవంతుడైన పురుషునితో సంగమము చేసినప్పటికిని స్త్రీలు శీఘ్రస్ఖలనమును పొందరు. అందువలన కామినీకాముకుల సంతోషముకొరకును పురుషుని ఇచ్ఛానుసారముగ స్త్రీ శీఘ్రముగా ద్రవించుటకు తగిన ఔషధివిశేషములను వ్రాయుచున్నాము.

శ్లో. సింధూరచించాఫలమాక్షికాని
తుల్యానియస్యామదనాతపత్రే
2క్షిప్తానివై సా పురుషప్రసంగాత్
ప్రాగేవరేత స్స్రుతిమాతనోతి. 39

తా. సింధూరము - చింతపండు - తేనె - వీనిని సమానభాగములుగాజేర్చి స్త్రీ యొక్క భగమందుంచినయెడల పురుషులతో సరసాలాపములను ప్రారంభించకముందే ద్రవించును. శీఘ్రస్ఖలనమును పొందును.

శ్లో. 3ఘోషారజః క్షౌద్ర4సమన్వితం తు
క్షిప్తం యదీయే స్మరయంత్ర గేహే
దృతా భవేత్ సా హఠ5తోహి నారీ
దృష్టస్సదాయం కిల యోగరాజః. 40

1 వక్ష్యేపల్లవయామి, 2 నిక్షిప్యతే సా
3 ఘోషంరజః 4 సమన్వితంవా 5 హఠమేవ

తా. చేదుబీరయొక్క చూర్ణమును తేనెలోకలిపి స్మరమందిరమున నుంచినయెడల స్త్రీ శీఘ్రముగా ద్రవించును. ఈ యోగమును యోగరాజు ప్రత్యక్షముగ చూచెను.

శ్లో. [1]అగస్తి పత్ర ద్రవ సంయుతేన
మధ్వాజ్య సంమిశ్రిత టంకణేన
విష్వా ధ్వజం యో[2] రమతేంగనానాం
సా శుక్రమావర్షతి శీఘ్రమేవ. 41

తా. నల్లఅగసి ఆకులరసమును - నెయ్యి-తేనెలో-కలిపి పురుషుడు దండమునకు పూసుకొని రమించినచో యువతి శీఘ్రస్ఖలనమును పొంది ద్రవించును.

శ్లో. సరోధ్రి ధత్తూరక పిప్పలీనాం
క్షుద్రోషణ క్షౌద్రి విమిశ్రితానాం
లేపేన లింగస్య కరోతి రేతః
స్రుతిం విపక్ష ప్రమదాజనస్య. 42

తా. లొద్దుగ - దత్తూరకము - పిప్పలి - చిట్టిమిరియాలు - నల్లమిరపకాయ - తేనెకలిపి లింగముపై పూసి రతిచేసినయెడల విరోధులస్త్రీయైనను శీఘ్రముగ రేతస్ఖలనమును పొందును.

శ్లో. సిద్ధార్థ మంజిష్ట తురంగమాణాం
జాతీప్రసూనం చ జలేన పిష్ట్వా
విలిప్య లింగం ప్రమదాముపేయాత్
స్పర్శేన రేతః క్షరతి ప్రకామం. 43

తా. తెల్లఆవాలు, చాయవేరు (మంజిష్ఠా), - పెన్నేరు, - జాజిపువ్వులు, - వీటిని నీటితో నూరి లింగమునకు లేపనమొనర్చి రమించినయెడల స్త్రీ ద్రవించును.

శ్లో. తుషజలపరిమిశ్రైః బీజపూరస్య మూలై
ర్ద్వివసకరమయూఖై [3]ర్మర్ధితైః [4]కామవేశ్మ

1 అగస్త్య 2 రమతేంగనాయాః 3 మర్దితం, 4 వేశ్మనీరం,

ద్రవతి ఝటితి1 లిప్తం భేషజస్యాస్య యోగా
దితి వదతి నరేంద్రో రంతిదేవః కవీంద్రః. 44

తా॥ మంచునీరు - మాదీఫలముయొక్క - వేరు - రెండింటిని కలిపి ఎండలోనుంచి తదుపరి స్త్రీ భగమునకు లేపనముచేసినయెడల శీఘ్రస్ఖలితమును పొందునని రంతిదేవుడు చెప్పెను.

-: ధ్వజస్థూలీకరణ ప్రయోగము :-

శ్లో. సకుష్ఠమాతంగ బలాబలానాం
వచాశ్వగంధా గజపిప్పలీనాం
తురంగశత్రోర్నవనీతయోగా
ల్లేపేన లింగం ముసలత్వమేతి. 45

తా. కోష్ఠు - నాగకేసరములు - ముత్తువపులగము - వస - గజపిప్పలి - పెన్నేరిగడ్డ - కరవీరము వీనినినూరి వెన్నలోకలిపి కామ ధ్వజమునకు పూసినయెడల లింగము రోకలివలె లావుగానుండును.

-: బ్రహ్మవల్ల్యాదిచూర్ణప్రయోగము :-

శ్లో. కిమత్రచిత్రం యది బ్రహ్మవల్లీ
వచాశ్వగంధా జలశూకచూర్ణం
ఉన్మత్త బీజం బృహతీఫలాఢ్యం
క్షణేనకుర్యాన్ముశలప్రమాణం. 46

తా. బ్రహ్మవల్లీ, వస, పెన్నేరు, తామరదుంప, ఉమ్మెత్త విత్తులు, నేలములకపండు, వీటిని చూర్ణముగాచేసి లింగలేపనమొన ర్చిన రోకలివలె స్థూలమగును.

శ్లో. సలోధ్ర కాశీస తురంగగంధా
2మాతంగగంధా పరిపాచితేన
తైలేనవృద్ధిం 3ఖలుయాంతి శీఘ్రం
4వరాంగ కర్ణ స్తన మేహనాని. 47

---

1 కాంతా, పా. 2 హేమపర్ణైః, 3 ఖలుయాతిలింగం, పా. 4 వరాంగనాలోచనమోహనంచ.

తా. లొద్దుగ - అన్నభేది - పెన్నేరి - పొన్నగంటికూర - వీనిరసములుకలిపి నూనెతో మిశ్రమముచేసి లేపనముచేసినయెడల ధ్వజము వృద్ధిపొందుటయేగాక లావుగానుండి ప్రియురాండ్రకు మోహనకరమగును.

—: ధ్వజదృఢీకరణము :—

శ్లో. 1హయారిపత్రం నవనీత2పిష్టం
వచా బలానాగ బలా మహైశ్చ
లేపేన లింగం సహసైవ పుంసాం
లోహోపమంస్యాదితి దృష్టమేతత్. 48

తా. తెల్లగన్నేరుఆకు - నవనీతపిష్టము - వస - ముత్తువపులగము - జిబిలికచెట్టు దంచి రసముగాజేసి లింగముపై లేపనమొనర్చిన యెడల లోహసమానమైన దృఢముకలిగియుండును.

—: వీర్యస్తంభనప్రయోగము :—

శ్లో. క్షీరేణ బస్తస్యచ 3వత్సమూలం
లజ్జాలుమూలం స్వయమేవ పిష్ట్వా
యస్తు స్వపాదౌ పరిలిప్య శేతే
రేతో న తస్య 4స్రవతే కదాచిత్. 49

తా. మేకపాలతో-అత్తపత్తి సమూలము-కొడిశె సమూలము-కలిపి పాదములకు రాచుకొని సంభోగము చేసినయెడల వీర్యము నిలువబడి చిరకాలమునకు స్ఖలనమగును.

శ్లో. శ్వేతేషు పుంఖాఖ్యతరోః ఫలాని
క్షీరేణ పిష్ట్వా వటపాదపస్య
కరంజ బీజోదర మధ్యగాని
బధ్నంతి వీర్యం వదనే ధృతాని. 50

తా. తెల్లవెంపలిచెట్టుపండు - మఱ్ఱిపాలతోనూరి - కానుగగింజలలోని గుజ్జును కలిపి లేపనముచేసినయెడల వీర్యము స్తంభించును.

పా. 1 హయారిపత్రీం, 2 మధ్యే
పా. 3 బద్ధమూలం, 4 ద్రవతే

శ్లో. శ్వేతేషు పుంఖాచరణం గృహీత్వా
పుష్యార్క-యోగే పురుషస్యకట్యాం
కుమారికా క ర్తిత సూత్రకేణ
1బద్ధం నయాత్యాశు మనోజసీరం. 51

తా. తెల్లవెంపలిచెట్టును సమూలముగా పెల్లగించి పుష్యమి నక్షత్రమున సూర్యుడుదయించు సమయమందు కన్యకచేత మొల త్రాడులో బంధింపజేసి పురుషుడు నడుమునకు కట్టుకొనినచో వీర్యము స్తంభించును.

శ్లో. ఆదాయ కృష్ణేతరకాకజంఘా
మూలం సితాంభోరుహ కేసరంచ
క్షౌద్రేణపిష్ట్వా పరిలిప్తనాభేః
స్తంభంప్రయాత్యాశు నరస్యబీజం. 52

తా. తెల్లవెలుమసంధి (చువుకు వెలుగుచెట్టు) యొక్క- వేరు - తెల్లతామరపువ్వు ఈ రెండింటిని తేనెతో కలిపి నూరి నాభిమీద లేపనము చేసినయెడల వీర్యము స్తంభించును.

—: వశీకరణప్రయోగములు :—

శ్లో. మంజిష్ఠతోయద వచాసిత భానుమూలై:
స్వీయాంగశోణితయుతై స్సమకుష్ఠకైశ్చ
కృత్వా లలాటఫలకే తిలకం కృతజ్ఞో
లోకత్రయం వశయతి క్షణమాత్రకేన. 53

తా. మంజిష్ఠ- నాగము స్తలు- వస- తెల్లజిల్లేడు మూలము- వీనిని దంచి తనశరీరపు ర క్తములో కలిపి ముఖమున తిలకముగా ధరించినయెడల మూడులోకములు క్షణమాత్రములో వశమగును.

శ్లో. దేవీమహోత్సవదినే 2కలకజ్జలం యత్
సిద్ధార్థకస్య సురసేన సరోత్తమాంగే
3నిష్పాతితం నరవరేణ నిశిశ్మశానే
తన్నేత్రగం భువనమేవ వశంకరోతి. 54

పా. 1 బద్ధంలయత్యాశు, 2 కిలకజ్జలం + తిలకాంజనంయత్, 3 నిఃపాతిత

తా. దుర్గాష్టమినిగాని విజయదశమినిగాని రాత్రి యందు శ్మశానమునకుబోయి మనుష్యకపాలములో ఆవనూనెతో మసి (కాటుక) పారజేసి ఆకాటుకను కంటిలో ధరించినచో లోకమును వశముచేసికొనగలడు.

—: వశీకరణ చూర్ణము :—

శ్లో. కుష్ఠోత్పలం మధుకరస్య చ పత్రయుగ్మం
మూలం తథా తగరజం సితకాకజంఘా
యస్యా శ్శిరోగతమిదం విహితంతు చూర్ణం
దాసీ భవేత్ ఝటితి సా తరుణీ న చిత్రం. 55

తా. కోష్టు-తామరపువ్వు-తుమ్మెదరెక్కలు - గ్రంధితగరము యొక్కమూలము-తెల్లనెలమసంధి వీనిని చూర్ణముగాజేసి ఏస్త్రీ శిరస్సున పురుషుడుంచునో ఆస్త్రీ వానికి దాసియైయుండును. ఇందుకు సందేహాములేదు.

—: వశీకరణలేపనము :—

శ్లో. 1సవ్యేన పాణికమలేన 2రతావసానే
యో రేతసా నిజభవేన 3విలాసదక్షః
వామం విలింపతి పదం సహసైవ యస్యాః
4తస్యైవ సా భవతి నాత్ర వికల్పభావః. 56

తా. విలాసపురుషుడు రతిక్రీడ సమాప్తమైనంతనే తన వీర్యమును ఎడమచేతితో గ్రహించి స్త్రీయొక్క ఎడమపాదమునకుంచి నచో ఆస్త్రీ అతనికి సంపూర్ణముగ వశమగును. ఇందుకు సందేహాములేదు.

---

(ఘ) పుస్తకములో 54 వ శ్లోకముతరువాత ఈశ్లోకమధికముగ వ్రాయబడినది.
శ్లో. తాలీశ కుష్ఠతగరైః పరిలిప్యవర్తిసిద్ధార్థతోలహితండ్రుఢపద్మవద్ధం
పుంసః కపోలఫలకే వినిపాతనేన తేనాంజనేనవశతాం కిలపాతియోగః.
(పైపాదములో అక్షరలోపము)

1 మధ్యేన 2 నిశావసానే 3 విలాసినీనాం 4 సాతస్యనైభవతి

శ్లో. సంభోగశేషసమయే నిజకాంతమేఢ్రం
యా కామినీ స్పృశతి వామపదాంబుజేన
తస్యాః పతిః సపది 1బిందతి దాసభావం
గోణీసుతేన కథితః కిల యోగరాజః. 57

తా. సంభోగానంతరము స్త్రీ తనప్రియునిమేఢ్రమును ఎడమకాలితో స్పృశించినచో నతడామెకు యావజ్జీవము వశుడై యుండును. ఇది గోణీపుత్రుడు వచించెను.

శ్లో. సింధూత్థ మాక్షిక కపోతమలాని పిష్ట్వా
లింగం విలిప్య తరుణీం రమతే నరో యః
సాన్యం ప్రయాతి పురుషం న కదాపి కామం
దాసీ భవేదతిమనోహర దివ్యమూర్తిః. 58

తా. సైంధవలవణము - తేనె - పావురముయొక్క మలము - సమాసభాగములుగా కలిపి నూరి దండమునకుపట్టించి సంభోగమొనర్చినచో నా యువతి పరపురుషులనువదలి అతనియందే ప్రేమకలదై దాసివలెనుండును.

శ్లో. భల్లాకమేఢ్ర ఘనసార మధూని పిష్ట్వా
లిప్తధ్వజో నిధువనం విదధీత యస్యాః
సాహ్లాదినీ కుసుమసాయక సన్నుతాంగీ
వశ్యాభవేచ్చిరతరం సహిసంశయోత్ర. 59

తా. ఎలుగుబంటిమేఢ్రము-కర్పూరము-తేనె కలిపి నూరి లింగమునకు పట్టించుకొని స్త్రీతో భోగించినయెడల నాస్త్రీ యతని నధికముగా ప్రేమించుచు దాసియగును. ఇందులో సందియములేదు.

శ్లో. గోరోచనా శిశిరదీధితి శంభుబీజ
కాశ్మీర చందనయుతైః కనకద్రవైశ్చ
లిప్తధ్వజః పరిరమత్యబలాం నరో యః
తస్యాః స ఏవ హృదయే ముకుటత్వమేతి. 60

---

1 విందతి

తా. గోరోజనము - కర్పూరము - పాదరసము - కుంకుమ పువ్వు - మంచిగంధము (చందన) - ఉమ్మెత్తరసము కలిపి లింగము నకు రాచుకొని రతిచేసినచో పురుషుడు ప్రియురాలి హృదయమం దెల్లప్పుడు నివసించును.

—: వశీకరణధూపము :—

శ్లో. శృంగీ వచా యువతి సర్జరసం సమానం
కృత్వా తృటిం మలయజంచ షడేవమిశ్రం
యో ధూపయేన్నిజగృహం వసనం శరీరం
తస్యాపి దాసఇవ మోహముపైతి లోకః. 61

తా. కర్కాటకశృంగి - వస - ఎఱ్ఱఅడవిమొల్ల - సర్జరసము (ఏపి)- శ్వేతచందనము సమానభాగములుగాకలిపి తన యిల్లు బట్టలు శరీరమును వాసనపుట్టునట్లు ధూపమువేసినయెడల లోకులందరు వశులై దాసులగుదురు.

—: వశీకరణమంత్రప్రయోగము :—

శ్లో. మదమదపదమాదౌ మాదయేతిద్వివారం
తదనుచలిఖనీయం సౌఖ్యదం హ్రీంచ తస్మాత్
అథచపదముపాన్తే నామరూపాది సంజ్ఞో
భవతిమదనమంత్రః స్వాహయా సంయుతేయం. 62

తా. ఈక్రింది మంత్రమును పదివేలు జపముచేసినయెడల తలంచినవారు వశులగుదురు.

మంత్రః=ఓంమదమదమాదయమాదయహ్రీం
అముకీంవశమానయస్వాహా

‡ శ్లో. శతశతపరిజాపాత్ స్యాదయం సిద్ధిదాతా
దశదశకుసుమానాం లోహితానాం చ హోమాత్

---

‡ పైన వ్రాయబడిన శ్లోకార్థము కొన్ని సంస్కృత ప్రతులలో గద్యా రూపమున వ్రాయబడినది. దాని నీక్రింద నుదహరించితిమి. అస్యమంత్రస్య దశ సహస్ర సంఖ్యాకోన్మితో జపః రక్తవర్ణైః పుష్పైర్మధు నా ఘృతేన చ హోమః కరణీయః.

ఇహాతు సకలకార్యం వామహస్తేన కార్యం
ఉపదిశతి సమాసాజ్జ్యోతిరీశః స్వరూపం. 63

తా. పైనవ్రాయబడిన మంత్రమును పదివేలు జపముచేసి రక్త పుష్పములను పదిచొప్పున పదిమార్లును నెయ్యి తేనెతోకూడ హోమము చేయవలయును. ఈకార్యమంతయు ఎడమచేతితో చేయవలయునని గ్రంథకర్త అభిప్రాయము.

—: కామదేవ ధ్యానము :—

శ్లో. కనకరుచిరమూర్తిః కుండలాకృష్టచాపో
యువతిహృదయమధ్యే నిశ్చలారోపితాక్షః
ఇతి మనసి మనోజం ధ్యాయయేత్ యో జపస్థో
వశయతి స సమస్తం భూతలం మంత్రశక్త్యా. 64

తా. బంగారువంటి సుందర దేహచ్ఛాయగలవాడును కర్ణకుండలముల కంటియున్న ధనస్సుకలవాడును నిరంతరము యువతుల హృదయమందు నివసించువాడును అగు మన్మథుని ఏ పురుషుడు భక్తితో ధ్యానముచేయునో వానికి కాముడు లోకమునంతయు వశపరచును.

—: చాముండా మంత్రవిధి :—

శ్లో. చాముండే ప్రథమం జయేతికథితం 1సంబోధసంమోహాయ
జ్ఞాతవ్యం వశమానయేతి చ పదం సాధ్యం ద్వితీయాయుతం
స్వాహాన్తః ప్రణవాదిరేష 2ప్రథితఃతంత్రే మహామోహాసః
సన్మంత్రః 3కవిశేఖరేణకథితో నాస్మాత్ ద్వితీయోభువిః. 65

మంత్రః. ఓం చాముండే జయచాముండే మోహాయ అముకీం దశమానయస్వాహా.

---

పా. 1 సంబోధనే, 2 కథిత స్తంత్రే, 3 కవిసార్థసేవితపదో,
సంస్కృతప్రతులలో పైతాత్పర్యమునుగద్యరూపమునవ్రాయబడినది.
అస్యమంత్రస్యజపోలక్షమేకం మదిరామిశ్రితపలాసకుసు
మైః హోమఃకరణీయః సర్వంవామహస్తేనకర్తవ్యం

తా. పై మంత్రమును ఒకలక్షజపముచేసి జపములో దశాంశము అనగా పదివేలు మోదుగపుష్పములను ఎడమచేతితో హోమము చేయవలయును.

—: చాముండాదేవీ స్తవము :—

శ్లో. దంష్ట్రాకోటివిసంకటా సువదనా సాంద్రాంధకారే స్థితా
ఖట్వాంగాసి నిగూఢదక్షిణకరా వామేసపాశం శిరః
శ్యామా పింగలమూర్ధజాఽభయకరీ శార్దూలచర్మాంబరా
చాముండా శవవాహినీ జపవిధౌ ధ్యేయా సదా సాధకైః. 66

తా. పెద్దదంతములు సుందరముఖముకలిగి అంధకారమున నివసించుచు ఖట్వాంగము (మంచపుకోడు)ఖడ్గముగా కుడిచేతను-ఎడమ చేతిలో పాశమునుకలిగి రాక్షసకపాలమును ధరించినట్టియు-శ్యామల వర్ణము బూడిదవర్ణముగల శిరోజములు-అభయహస్తము - వ్యాఘ్ర చర్మవస్త్రము కలదై-శవవాహినియైన చాముండేశ్వరిని సాధకులు భక్తితో ధ్యానింపవలయును.

—: విశ్వేశ్వరీ మంత్రము :—

శ్లో. ఓంకారః ప్రథమం నమో నమ ఇతి ప్రోక్తం చ తస్మాత్పరం
చాముండే పరికీర్తితం హిలిహిలి జ్ఞేయా చ సంజ్ఞా తతః
జ్ఞాతవ్యం తు సమానయేతి చ పదం సన్మంత్రిణాం సమ్మతో
మంత్రోఽయం కవిశేఖరేణ కథితః ఖ్యాత స్సదా సిద్ధిదః. 67

మంత్రః. ఓంనమో నమశ్చాముండే హిలిహిలి అముకీం వశమానయ స్వాహా.

గద్య. అస్య మంత్రస్య జపో లక్షపరిమితిః పలాశకుసుమైశ్చ హోమఃకరణీయః సర్వం వామహస్తేన కర్తవ్యం.

తా. పై మంత్రమును ఒకలక్షజపముచేసి మోదుగపువ్వులతో దశాంశమును హోమముచేయవలయును. అంతయు వామహస్తతో చేయవలయును.

—: విశ్వేశ్వరీధ్యానం :—

శ్లో. వజ్రాసక్త శరాసనా త్రినయనా సవ్యేతరేసాంకుశం
వామేనాపి కరేణ పాశమురసి న్యస్తోత్తమాంగస్రజా
వ్యాముక్తోరుకచా కరాలవదనా వహ్నిప్రభా మధ్యగా
ధ్యేయాజాప్యవిధౌ నరైరితిసదా విశ్వేశ్వరీ సిద్ధయే. 69

తా. వజ్రాసనమున నాసీనయైనట్టియు-మూడునేత్రములు-కుడి చేతిలో అంకుశము-ఎడమచేతిలో పాశము ధరించినట్టియు - శిరమున మాల-విప్పబడినవేణి-భయంకర ముఖముగల్గి భగభగమండుచున్న అగ్నిమధ్యమున నిలుబడిన విశ్వేశ్వరిని ఎల్లప్పుడు సాధకుడు ధ్యానము చేయవలయును.

—: పద్మినీవశీకరణమంత్రము :—

మంత్రః= ఓంకామేశ్వర ! మోహాయస్వాహా.

గద్య. అనేన మంత్రేణ మధుమిశ్రిత జాతీకుసుమసహితం
తాంబూలమాదిత్యదినే 1పంచశతవారమభిమంత్రితం
పద్మిన్యైదాతవ్యం పద్మినీవశ్యాభవతి.

తా. పైన ఉదహరింపబడిన మంత్రము నుచ్చరించుచు మధుమిశ్రిత మాలతీపుష్పములతోగూడిన తాంబూలపత్రమును ఆదివారము నాడు అయిదువందలమారులుమంత్రించి పద్మినికిచ్చినచో నామె వశ్యయగును.

—; చిత్రిణీవశీకరణమంత్రము :—

మంత్రః. ఓంపచపచ ఓంవిహంగమ విహంగమ
ఓంకామదేవాయస్వాహా.

గద్య. అనేన మంత్రేణ రంభామూల జలపుటిత జాతీఫలమిలిత
తాంబూల మాదిత్యదినే పంచశతవారమభిమంత్రితం
చిత్రిణ్యైదాతవ్యం చిత్రిణీవశ్యాభవతి.

తా. ఆదివారమునాడు అరటిదుంపరసముతో భావనచేయబడిన జాజికాయను తాంబూలపత్రములోనుంచి పైమంత్రముతో

1 సహస్రవారం

అయిదువందలసార్లు అభిమంత్రించి చిత్రిణికిచ్చినచో నామె వశ్యురాలగును.

—: శంఖినీ వశీకరణమంత్రము :—

మంత్రః. ఓంహరహర ఓంపచపచ కామదేవా య స్వాహా.

గద్య. అనేన మంత్రేణ తగరమూలం శ్రీఫలంచాదిత్యవారే అష్టోత్తరశతవార మభిమంత్రితం శంఖిన్యై దాతవ్యం సా వశ్యా భవతి.

తా. గ్రంధితగరమూలమును కొబ్బరికాయను పై మంత్రముతో నూటఎనిమిదిమార్లు అభిమంత్రించి శంఖినికిచ్చినచో నామె వశ్యురాలగును.

—: హస్తినీ వశీకరణమంత్రము :—

మంత్రః. ఓం చిరిచిరి వశంకురు కామదేవాయ స్వాహా.

గద్య. అనేనమంత్రేణ ఆదిత్యదినే క్షౌద్రక్తా కపోతభ్రమరౌ తాంబూలదలే విన్యస్య అష్టోత్తరశత మభిమంత్రితం కృత్వా హస్తిన్యై దేయం హస్తినీ వశ్యా భవతి.

తా. ఆదివారమునాడు మధుమిశ్రితములైన పావురము రెక్కలను తుమ్మెదరెక్కలను తమలపాకులోనుంచి నూటఎనిమిది మారులు అభిమంత్రించి హస్తినికిచ్చినచో నామె వశ్యురాలగును.

—: అనిచ్ఛాహరణోపాయము :—

శ్లో. క్షీరోదనం ద్విజవరాయ [1]పురా ప్రదద్యాత్
పుష్యోద్ధృతం సితబలా చరణం కుమార్యా
పిష్టం ప్రదత్తమితి వైరకృతా మనిచ్ఛాం
నిస్సారయేదిహా ముహుర్విదితప్రభావః. 69

తా. స్త్రీకి వాంఛలేకపోవుటగాని ఉదాసీనముగాని కలిగిన యెడల బ్రాహ్మణునకు పాయసమునుభుజింపజేసి పుష్యమినక్షత్రమందు తెల్లముత్తువపులగమును బాలికచే పెల్లగింపజేసి నూరించి ఆ స్త్రీకి త్రాగించినయెడల ఆమెయొక్క ఉదాసీనత అనిచ్ఛయు సంతోషము వేడుకగామారును.

పా. 1 పునః

—: స్తనోత్థాపనము :—

శ్లో. మాతంగ కృష్ణామయ వాజిగంధా
వచాయుతాః పర్యుషితాంబుమిశ్రాః
హాయారిపత్రీ నవనీతయోగాత్
కుర్వంతి పీనం కుచకుంభయుగ్మం. 70

తా. మాతంగము, - పిప్పలి, - ఆమయము, - పెన్నేరి - వస - నిలువనీరు - కరవీరపత్రి వీనిని వెన్నలోఁగలిపి పూసినయెడల చిన్నవైన స్తనములు పెద్దవగును.

శ్లో. వసా భుజంగస్య హాయారి1పత్రం
కోలస్య మేధ స్సమభాగయుక్తాః
వక్షోజకుంభం మదిరాయుతాభ్యాః
కుర్వన్తి పీనం సకలం హఠేన. 71

తా. సర్పముయొక్క-కొవ్వు - కరవీరపత్రము - పందికొవ్వు - సమానభాగములుగాకలిపి పూసినయెడల స్తనములు పెద్దవగును.

శ్లో. తైలం హఠాద్దాడిమ కల్క సిద్ధం
సిద్ధార్థజం లేపనతో నితాంతం
నారీ స్తనా 2చారుతరా సుపీనా
కుర్యాదసౌ యోగవర స్సదైవ. 72

తా. తెల్లఆవనూనెలో - దానిమ్మపెచ్చులను - శుద్ధిచేసి - వెలుపలికితీసి ఆనూనెను వక్షస్థలమందు మర్దనముచేసినయెడల స్తనములు సుందరములై ఆకర్షణీయములై కఠినములై యుండును.

శ్లో. శ్రీపర్ణికాయా రసకల్క-సిద్ధం
తిలోద్భవం తైలవరం 3ప్రదిష్టం
తైలేన వక్షోజయుగే ప్రదేయం
ప్రయాతి వృద్ధిం పతితోపి నార్యాః. 73

---

1 ప్రత్యః 2 చారుతటా
1 ప్రదేయం + ప్రలేపాత్ (అను పాఠాంతరములు కలవు.

తా. గుమ్మడుచెట్టు బెరడుయొక్క రసమును - నువ్వుల నూనెతో వండి స్తనములకు పట్టించిన యెడల వాలిపోయిన స్తనములుకూడ ఉన్నతములై నిలువబడి కఠినముగానుండును.

—: యోని సంస్కారము :—

శ్లో. పరిక్షాళయే న్నింబకషాయ నీరైః
నిశాజ్య కృష్ణాగురు గుగ్గులూనాం
ధూపేన యోనిం నిశి ధూపయిత్వా
నారీప్రమోదం విదధాతి భర్తుః. 74

తా. వరాంగమును వేపాకు కషాయముతో కడిగి రాత్రివేళ నెయ్యి - కృష్ణాగరు - గుగ్గిలము - వీనితో ధూపము వేసిన-చో భగము సువాసనతో కూడుకొని కాముకులకు ఆనందప్రదముగా నుండును.

శ్లో. జాతీప్రసూనైః సితసర్షపస్య
తైలం పచేల్లఘ్వనలే 1ప్రధానం
అభ్యంగయోగేన సదైవ యోనేః
సౌభాగ్య మాప్నోతి రతే పురంధ్రీ. 75

తా. తెల్లఆవాలనూనెలో - మాలతీపుష్పములనువేసి సన్నని మంటమీద ఉడకపెట్టి ఆనూనెను భగమునకు పట్టించి స్నానముచేసిన-చో శుభప్రదమగును.

—: రోమనాశనప్రయోగము :—

శ్లో. భుజంగచూర్ణం కటుతైలమధ్యే
సప్తాహమాదిత్యకరే నిధేయం
తత్తైలయోగేన విలాసినీనాం
నశ్యంతి రోమాణి సమూలమేవ. 76

తా. సర్పాక్షిచూర్ణమును, - చేదుదోస నూనెలోవేసి వారముదినములు ఎండలో నుంచినపిమ్మట శరీరమందేభాగమున బట్టించినను రోమములులేక నున్నగానుండును.

పా. 1ప్రకామం.

శ్లో. పలాశభస్మాన్విత తాలచూర్ణై
రంభాంబుమిశ్రై రుపలిప్య భూయః
కందర్పగేహే మృగలోచనానాం
రోమాణి రోహన్తి కదాపి నైవ. 77

తా. మోదుగభస్మముతో హరితాళచూర్ణమును కలిపి అరటిదుంపరసమును మిశ్రమముచేసి మదనమందిరమందు పట్టించిన యెడల రోమములు రాలిపోయి మరల పుట్టవు.

శ్లో. రంభాజలే సప్తదినం విభావ్య
భస్మేహ కంబోర్మసృణం చ పశ్చాత్
తాలేన యుక్తం చ విలేపనేన
రోమాణి నిర్మూలయతి క్షణేన. 78

తా. సన్నని శంఖచూర్ణమును అరటిరసములో కలిపి ఏడు దినములుంచి హరితాళచూర్ణమును మిశ్రమముచేసి పట్టించినయెడల రోమములు రాలిపోవును.

—: శీఘ్రముగ ఋతుమతియగుటకు సాధనము :—

శ్లో. జ్యోతిష్మతీ కోమలపత్ర మగ్నౌ
భృష్టంజవాయాః కుసుమేన పిష్టం
గృహాంబునా పీతమిదం యువత్యా
కరోతి పుష్పం స్మరమందిరస్య. 79

తా. జ్యోతిష్మతి (పెద్దమావేరు) యొక్క లేత ఆకులను నిప్పుమీద కాచి జపాకుసుమములతో నూరి వర్షము కురియునప్పుడింటిపై నుండి పడు జలమును పట్టి యాజలములో మందును కలిపి త్రాగించినయెడల సకాలమునకు ఋతుమతికాని స్త్రీలు తప్పక ఋతుమతి అగుదురు.

—: గర్భధారణప్రయోగము :—

శ్లో. తురంగగంధా 1శృతవారిసిద్ధ
మాజం పయః స్నానదినే నిపీయ
ప్రాప్నోతి గర్భం నియమం చరం తీ
నంధ్యాపి సూనుం పురుషప్రసంగాత్. 80

తా. పెన్నేరిదుంపతో ఉడకపెట్టిననీటిని స్త్రీ ఋతుమతియైన నాడు నియమముతోనుండ త్రాగినయెడల గొడ్రాలైనను పురుష సాంగత్యమువలన తప్పక గర్భము ధరించును.

శ్లో. పుష్యోద్ధృతం లాక్ష్మణమేవ మూలం
భర్త్రా నిపిష్టం సఘృతం చ పీతం
క్షీరౌదనం ప్రాశ్య పతిప్రసంగాత్
గర్భం విధత్తే తరుణీ న చిత్రం. 81

తా. పుష్యమినక్షత్రమందు లక్ష్మణమూలమును (లక్ష్మణ పంజిచెట్టువేరు) భర్తపెల్లగించి నూరి నేతిలోకలిపి భార్యచే త్రాగించిన పిదప పాలుఅన్నమును భుజింపజేసి సంభోగముచేసినయెడల నాయువ తికి తప్పక గర్భము సంభవించును. ఇందు ఆశ్చర్యములేదు.

శ్లో. యా బీజపూరద్రుమ మూలమేకం
క్షీరేణ సిద్ధం హవిషా విమిశ్రం
ఋతౌ నిపీయ స్వపతిం ప్రయాతి
దీర్ఘాయుషం సా తనయం ప్రసూతే. 82

తా. ఏయువతి మాదీఫల వృక్షముయొక్క వేరును పాలతో ఉడకపెట్టి నేయికలిపి త్రాగి అనంతరము పతితోభోగించునో ఆమె గర్భవతియై దీర్ఘాయువుగల పుత్రుని కనును.

—: గర్భరక్షణ నియమము :—

శ్లో. కశేరు శృంగాటక జీవనాఖ్య
పయోధరై రండ శతావరీభిః

పా 1 శృత

సిద్ధం పయః శర్కరయా విమిశ్రం
సంస్థాపయే ద్గర్భ ముదీర్ణ శూలం. 83

తా. కశేరు (సమ్మదుంప) శృంగాటకము (కోవెల దుంపగడ్డ - తిప్పతీగె, కోశకారమను చెఱకు - ఆముదపుచెట్టు - పిల్లిపీచర ఈ వస్తువులతో పాలను ఉడికించి త్రాగినయెడల గర్భరక్షణము కలుగును.

—: సుఖప్రసవమంత్రములు :—

శ్లో. ఓం. ఇహామృతంచ సోమంశ్చ చిత్రభానుశ్చభామినీ
ఉచ్చైశ్రవా తురంగాణాం మందిరే నివసంతు తే. 84

శ్లో. ఓం. ఇదమమృతమపాం సముద్ధృతం వైః
తవ లఘు గర్భమిమం విముంచతు స్త్రీ
తదనలపవనార్కవాసరా స్తే
సహ లవణాంబుధరైర్దిశంతు శాంతిం. 85

శ్లో. ఓం. ముక్తాః పాశవిపాశాశ్చముక్తాః సూర్యేణ రశ్మయః
1ముక్త స్సర్వభయాద్గర్భ ఏహిమాచిరమాచిరం స్వాహా. 86

మంత్రః. "ఓంమన్మథమన్మథమన్మథవాహిని
లంబోదరముంచముంచ లఘుస్వాహా"

శ్లో. ఏభిర్జలం చ్యావనమంత్రరాజైః
జప్త్వా ప్రదేయం కిల గర్భవత్యై
సద్యః ప్రసూతే నవమూఢగర్భా
యోగోఽయమాత్రేయ మునిప్రతిష్టః. 87

తా. పై మంత్రములచేత జలమును ఏడుమార్లు అభిమంత్రించి గర్భవతికిత్రాగనీయవలయును. ఇందువలన గర్భవతికి ప్రసవసమయమందలి కష్టము బాధయుండదు. సుఖప్రసవమగును.

—: వంధ్యాకరణ ప్రయోగము :—

శ్లో. పలాశక్షీరిద్రుమయోః ఫలాని
పుష్పాణ్యథో శాల్మలిపాదపస్య

పా. 1 ముక్తఃసర్వభయాద్ ఏహి

మద్యేన మాంసార్ధదినం నిపీయ
వంద్యా భవేన్నిశ్చితమేవ నారీ. 88

తా. మోదుగపండ్లు పాలపండ్లు బూరుగపువ్వులు నూరి తేనెతోకలిపి పదునైదుదినములు త్రాగినయెడల స్త్రీగొడ్రాలగును.

శ్లో. ఫలం కదంబస్య చ మాక్షికాని
తుషోదకేన త్రిదినం నిపీయ
స్నానావసానే నియమే నచాపి
వంధ్యామవశ్యం కురుతే హఠేన. 89

తా. స్త్రీ ఋతుస్నానాంతరమున కడిమిపండు తేనె తుషోదకముతో (మంచునీరు) మూడుదినములు త్రాగినయెడల గొడ్రాలగును.

శ్లో. కర్షద్వయం రాక్షసవృక్షబీజం
సప్తాహమాత్రం సితశాలివారా
ఋతౌ నిపీతం మృగశావకాక్ష్యా
వంధ్యాత్వమేతన్నియతం కరోతి. 90

తా. రెండుకర్షముల ఎత్తు (అనగా 160 గురివిందగింజలఎత్తు) గల రాక్షసవృక్ష (బలురక్కసచెట్టు) విత్తనములను కడుగు (అరవా చావల్) నీటితో కలిపి ఋతుకాలమందు సేవించినయెడల స్త్రీ అవశ్యముగా వంధ్యయగును.

—: వెంట్రుకలు పెరుగు సదుపాయము :—

శ్లో. తిలప్రసూనం సహ గోక్షురేణ
ససారఘం గవ్యఘృతేన పిష్టం
సప్తాహమాత్రేణ శిరంప్రలేపాత్
భవంతి దీర్ఘాః ప్రచురాశ్చకేశాః. 91

తా. సన్నపల్లేరు, - తిలపుష్పములు, - పచ్చనితేనె - (ససారఘు) వీనిని ఆవునేతితో నూరి ఒకవారముదినములు శిరస్సునకు లేపనము చేసినయెడల వెంట్రుకలు గుబురుగా పొడవుగా నుండును.

శ్లో. కర్షార్థమాత్రం ప్రసవం ఫలేన
నింబస్య తైలం నియమేన పీతం
క్రమేణ కుర్వన్ననుతుషారగౌరం
శిరోరుహం మేచకతాముపైతి. 92

తా. నలుబది గురివిందగింజలయెత్తు పుసవఫలమును వేపనూనెతో కలిపి ప్రతిదినమూ త్రాగినయెడల తెల్లనివెండ్రుకలు నల్లనగును.

శ్లో. గుంజాఫలైః క్షౌద్రయుతైర్విలిప్య
1కేశప్రదేశో సకలేంద్రలుప్తం
అనేన యోగేన సదైవకేశాః
రోహంతి కృష్ణాః కుటిలావిశాలాః. 93

తా. గురువిందకాయ తేనెతో కలిపి రాలిపోవు తలవెండ్రుకల మొదళ్ళకుపట్టించిన బట్టతలయైననూ గుబురుగా నల్లనివెండ్రుకలు కలుగును.

ఇతి శ్రీకవిశేఖర జ్యోతిరీశ విరచితే పంచ
సాయకే తృతీయః సాయకః.



1 కేశప్రదేశం

శ్రీరస్తు.

# పంచసాయకము.

## —♦ చతుర్థ సాయకము ♦—

### —: కన్యాలక్షణము :—

శ్లో. ప్రఖ్యాతే మహతి ప్రభూతవిభవేచారిత్రశీలాన్వితే
విద్యా ధైర్య వివేక శౌర్య విభవశ్లాఘ్యే కులినేకులే
కన్యా భ్రాతృయుతా సుశీలవినయారూపోజ్జ్వలా దక్షిణా
త్రైవర్గాశ్రిత శుద్ధవంశనిలయాసద్భిర్వివాహ్యా నరైః. 1

తా. గొప్పతనము - అధికధనసంపద - సచ్చరిత్రము - పాండిత్యము - దీర్ఘాలోచనము - వివేకము - సౌశీల్యము గల పురుషుల కుమార్తెలు - సోదరులుగల కన్యకలు - సుశీలము - వినయము - రూపము - గాంభీర్యము గల కన్యకలు ధర్మ - అర్థ - కామములనే త్రివర్గములను చక్కగ పరిపాలించు వంశమునబుట్టిన బాలికలు - సజ్జనులైన పురుషులకు పాణిగ్రహణమునకు తగినవారు.

త్రివర్గపాలనమును గురించి శాస్త్రకారులు చెప్పిన వాక్యమే మనగా "ధర్మార్థకామ స్సమమేవ సేవ్యాః యోహ్యేకసక్తః స జనో జఘన్యః" అని వ్రాసినట్లుగా మూడింటిని పరిపాలింపవలయును.

ఒక్క ధర్మమును పాలించినచాలదా ధర్మార్థకామములు మూడింటితో నవసరమేమి ? అని ప్రశ్నింతురేమో దానికి ప్రత్యుత్తరమేమనగా ? పురుషుడు దేవర్షి పితౄణాదులతో బంధితుడై యుండునుగనుక ఎవడు ఋణత్రయ విముక్తుడై తల్లి - తండ్రి - పుత్ర - కళత్రాదులను సంతుష్టిజేసి వారి కోర్కెలను దీర్చియున్నాడో అట్టివాడు నాలుగవదైన మోక్షసాధనమున కర్హుండు గనుక ధర్మపాలనమును జేసికొనినచాలును. పైనవ్రాయబడిన దారపుత్ర పరిరక్షణాది విధాయక కార్యములు నెరనేర్పజాలక కృత్రిమ వైరాగ్యమునువహించి

---

1 "అరోగిణీం భ్రాతృమతీమసమానార్ష గోత్రజాం" ఇతి యాజ్ఞవల్క్య స్మరణాత్.

సంచరించునో వాడు నిందనీయుడుగా నెన్నబడుచున్నాడుగాన - పై శ్లోకమున కవి "త్రైవర్గాశ్రితశుద్ధవంశ" అని పేర్కొనియున్నాడు.

శ్లో. అంభోజాస్యా బహలనయనా భూరికేశప్రచారా
తుల్యాస్నిగ్ధా సుసమదశనా పద్మరాగాధరోష్ఠీ
రమ్యశ్రోత్రా మధురవచనా కంబుకంఠీ శుభాంగీ
మధ్యేక్షీణా సులలితకరా దక్షిణావర్తనాభిః. 2

తా. పద్మమువంటి ముఖమండలము నేత్రములును - నల్లని పొడువుగల కేశములు - చక్కని పలువరుస - పద్మరాగమణివలె ఎర్రని అధరోష్ఠము - సుందరములైన చెవులు - తియ్యని వాక్కులు - శంఖమువంటి కంఠము - సన్ననినడుము - అందమైన చేతులు - శుభలక్షణములతో సంపన్నమైన అంగము - దక్షిణావర్తముగల (అనగా కుడివైపునకుతిరిగియున్న) నాభియు -

శ్లో. పీనశ్రోణీ కనకకదళీ స్తంభ జంఘాభిరామా
రక్తాశోక ప్రసవచరణా స్నిగ్ధశాఖాంగుళీకా
ఇద్ధంయుక్తా సులలితతను ర్లక్షణై రుత్తమై ర్యా
కన్యా సద్భి శ్శుభలచరితా సా వివాహ్యా గుణజ్ఞైః. 3

తా. బలసిన పిరుదులు (శ్రోణీ) - బంగారమువర్ణముగల అరటి స్తంభములవంటి తొడలు - (రక్తాశోకము) ఎర్రఅశోకపుష్పమువంటి పాదములు - నున్ననైన ఘనమైన వేళ్లు - గలకన్యలు ఉత్తమకన్యక లనబడుదురు. పైన చెప్పబడిన లక్షణములుగల కన్యకను గుణవంతుడైన పురుషుడు వివాహమాడవలయును.

-: దుష్కన్యాలక్షణము :-

శ్లో. ఖర్వా పింగలకుంతలా కృశతను ర్దీర్ఘాతిరోమావళా.
కృష్ణా సాకర[1]లోచన పృథుగలా కృష్ణాధరాదంతురా
రూక్షాంగీ వికట ప్రసీ చ [2]సకలా[3]విభ్రూరవీరాత్మజా
వాచాలా బహుభోజనాచ గదినీ ప్రోథాచ దుఃఖాన్వితా. 4

1 లోచనా, 2 సబలా, 3 వ్యభ్రూరి. వికటాఃభ్రువఃయస్యాఃసావ్యభ్రూః అనగా అశుభసూచకములైన కనుబొమలు కలది.

తా. పొట్టిది - బూడిదవర్ణముగల తలవెంట్రుకలు కలది - మిక్కిలి సన్ననిశరీరముకలది - మిక్కిలి లావుశరీరము - అధికమైన రోమములు - మిక్కిలినలుపు - పందికన్నులవంటి కన్నులు - మోటు కంఠము - నల్లని అధరోష్టము - ఎత్తైనదంతములు - కఠినమైన శరీరము - వికటములైన స్తనములు - ఎక్కువ బలముకలిగియుండుట - పతి - పుత్రులు - లేని స్త్రీయొక్క పుత్రిక - అధికముగా మాట్లాడుట - భుజించుట - రోగిణి - ప్రౌఢ - దుఃఖములతో కూడినది.

శ్లో. పుష్ప క్ష్మాధర వృక్ష దేశ4 గదినీ నక్షత్ర సంజ్ఞాచయా
హాస్యే కూపయుగం5 కపోలయుగళే యస్యా భవేత్ సత్వరం
అంగుష్ఠాధిక పర్వణీ చరణయో ర్యస్యాశ్చ జాతాంగులిః
పాదస్యాపి కనీనికా న పతతిక్ష్మాయాం తదన్యైవ వా. 5

తా. పుష్పము - పర్వతము - వృక్షము - దేశము - నది - నక్షత్రనామము - పేర్లుగాగల కన్యకలు - నవ్వునప్పుడు కపోలములపై లోతుగా గుంటలుపడి అణగిపోవుట - బొటనవ్రేలిపై ఎక్కువ కణుపులుకలది - కాలివ్రేళ్లు వికారముగా నుండుట - పాదములు - అనగా అడుగులు నేలకు అంటకుండుట - ఈ పూర్వోక్తలక్షణములు అనగా రెండు శ్లోకములయందు చెప్పబడిన లక్షణములుగల కన్యకలు వివాహయోగ్యలు కారు.

శ్లో. అజ్ఞాతాన్వయజా స్వభావపిశునా లంబాధరా చంచలా
కుష్టిశ్చిత్రికులోద్భవా చ వితతా యస్యాః కటిర్నాసికా
నింద్యా పల్లవజిహ్వికా ద్రుతగతి ర్న్యూనాధికాంగీ పున
స్త్యాజ్యా కామకలా కలాపకుశలైః కన్యా వివాహే సదా. 6

తా. తెలియబడని కులశీలములు కలది - దుష్టస్వభావురాలు - వ్రేలాడు అధరోష్ఠముకలది - అతిచంచల - కుష్ఠురోగి కుమార్తె - వ్యాపించి వెడల్పుగావుండెడి ముక్కునూ - కటిప్రదేశమునూగలది -

4 తటినీ, 5 కపోలఘనకే.

చిగురుటాకువంటి జిహ్వ - గలకన్యకలు వివాహయోగ్యలు కారని కామకలావిదులు గ్రహించవలయును.

—: వరలక్షణము :—

శ్లో. ప్రఖ్యాతోఽమలవంశజో నవవయాః 1శూర స్సుశీలశ్చ యః
2స్వాచారః స్థిరసౌహృదో గుణనిధి ర్జ్ఞానాకుటుంబీ బలీ
3అర్థీ భోగరతో విశిష్టవచనో దాక్షిణ్య ధైర్యాశ్రయో
జామాతా జగతీతలే కవివరై రేవంవిధో వర్ణితః. 7

తా. ప్రఖ్యాతిగల పరిశుద్ధమైన వంశమునబుట్టినవాడు - నవయువకుడు - వీరుడు - సుశీలుడు సదాచారి - చంచలములేని మిత్రత్వముగలవాడు- గుణవంతుడు - సజ్జనులైన మనుష్యులుగల కుటుంబమునకు చెందినవాడు - బలవంతుడు - వాక్చాతురి - భోగమందాసక్తి - కోరికలుగలవాడు- దయ - ధైర్యము - మొదలగు సుగుణములు కలవాడు - ఈ పైనచెప్పబడిన లక్షణములు కలవాడు కన్యాదానమునకర్హుడు.

—: వరునియందలి దోషములు :—

శ్లో. పాపిష్ఠో వ్యసనీ ఋణై రుపహతో ద్యూతప్రియో భిక్షుకో
రోగీ పుంస్త్వవివర్జిత శ్చలమతి ర్వైదేశికః కాతరః
మూర్ఖో దుష్టకులోద్భవశ్చ కృపణో 4వృద్ధోతిదీనః ఖలః
కర్తవ్యో న వరః కదాపి పురుషై రేవంవిధో భూతలే. 8

తా. పాపి - వ్యసనలోలుడు - ఋణగ్రస్తుడు - జూదరి - బిక్షుకుడు - దరిద్రుడు - రోగి - పుంస్త్వములేనివాడు - స్థిరచిత్తములేనివాడు - ప్రవాసి - దేశాటనముచేయువాడు - ధైర్యములేనివాడు - పిరికివాడు - మూర్ఖుడు - దుష్టకులోద్భవుడు - కృపణుడు - వృద్ధుడు- అతిదీనుడు - దుష్టుడు - ఈ గుణములు కలపురుషులు - కన్యాదానమున కర్హులుకారు.

1 శూరశ్చశీలాశ్రయః 2 సాచారః 3 అర్థా 4 వృద్ధోద్వేచ ర్మాఖలః

—: వివాహ భేదములు :—

శ్లో. చాతుర్వర్ణ్య సమాహితా మునివరై రష్టౌవివాహాః స్త్రియో
బ్రాహ్మో దైవతక స్తతో నిగదితౌ గాంధర్వ పైశాచకౌ
ఆర్షో రాక్షసక స్తథాఽఽసుర ఇతి ఖ్యాతోఽపర శ్చాష్టమః
ప్రాజాపత్య సమాభిధః పృథగమీ ప్రోక్తా మయా నామతః. 9

తా. చతుర్వర్ణమునకు సమ్మతమైన వివాహము లెనిమిది విధములని మునీశ్వరులు చెప్పినారు. ఎట్లనగా బ్రాహ్మణము - దైవతకము - గాంధర్వము - పైశాచకము - ఆర్షము - రాక్షసకము - ఆసురము - ప్రాజాపత్యము - అను ఎనిమిది భేదములు.

శ్లో. ఆర్షో దైవతకః ప్రజాపతిభవో బ్రాహ్మో ద్విజానాం మతో
గాంధర్వః సహ రాక్షసే నకథితః క్షాత్రస్య తజ్ఞైరసౌ
1పైశాచాసుర సంజ్ఞకో నిగదితో వైశ్యస్య శూద్రస్యచ
సంక్షేపా దుపవర్ణితం క్రమవశా త్పౌరాణికం లక్షణం. 10

తా. ఎనిమిదివిధములైన వివాహములలో ఆర్షము - దైవతకము - ప్రాజాపత్యము - బ్రాహ్మము - ఈ నాలుగు వివాహములు బ్రాహ్మణులకొరకు ఏర్పడినవి. గాంధర్వము - రాక్షసము - క్షత్రియులకొరకు, పైశాచ - అసుర వివాహములు వైశ్యునకు - శూద్రునకు ఏర్పడినవి. ఈ విధముగ పురాణములో చెప్పబడిన లక్షణప్రకారము సంక్షేపముగ వర్ణింపబడినది.

—: ఆర్ష వివాహలక్షణము :—

శ్లో. విద్యావాన్ గుణపూజితః సుచరితః సద్వంశజాతో మునిః
సౌమ్యో మానరతః సుశీలవినయో గేహాగతః2 ప్రార్థకః
కన్యాయా గృహనాయకః సపులక స్తస్మై దదాత్యాదరాత్
ఆర్షో గోయుగ దక్షిణో నిగదితః తజ్ఞై ర్వివాహోవరః. 11

తా. విద్వాంసుడు - సద్గుణవంతుడు - సచ్చరిత్రుడు - సద్వంశజుడు - సుందరుడు - అభిమాని - సుశీలవినయములు కల

1 పైశాచాసురసంజ్ఞితౌ నిగదితౌ
2 ప్రార్థితః + సార్థకః

వాడు - స్వయముగ ఇంటికివచ్చి ప్రార్థింపబడినవాడు నగు వరునకు కన్యాదాత సంతోషముతో ఆదరముతో రెండు గోదానములతో తనకన్యనీయవలయును. ఇట్టివివాహమునకు ఆర్షవివాహమని పేరు. శ్రేష్ఠతమమైన వివాహము.

—: దైవత వివాహలక్షణము :—

శ్లో. ఋత్విగ్భిః పరిమండితే [1]బహువిధే యజ్ఞోత్సవే చోత్తమే
నానావర్ణ సువర్ణవస్త్రకుసుమై రాభూషితాంగీ శుభా
కన్యా [2]దక్షిణయా ద్విజాయ విధినా యద్దీయతే చాదరాత్
దైవస్సోయ ముదీరితఃకవివరై రిత్థం వివాహోవరః. 12

తా. ఋత్విక్కులచేత చుట్టబడియున్న ఉత్తమములైన పెక్కువిధములైన యజ్ఞోత్సవములయందు - అమూల్య వస్త్ర పుష్పాభరణాదులచే నలంకరింపబడియున్న అవయవములుగల శుభ లక్షణ సంపన్నయగు కన్యను విధిపూర్వకముగ దక్షిణతో కూడ కన్య దాత బ్రాహ్మణశ్రేష్ఠునకు కన్యాదానము చేసినయెడల నది దైవతవివాహమని చెప్పబడును.

—: ప్రజాపత్యవివాహ లక్షణము :—

శ్లో. కన్యా బాంధవసన్నిధౌ సులలితావిప్రోత్తమాయాఽదరా
[3]దుక్త్వా తుభ్యమియం మయా స్వతనయా దత్తేతి హర్షాన్వితౌ
ధర్మం సంచరతాం యథాసుఖ ముభౌ[4]దాంపత్యయోగా త్సదా
ప్రాజాపత్య కరగ్రహః కవివరై రేషః ప్రమాణీకృతః. 13

తా. బంధువులయెదుట కన్యదాత "పూర్వమందు నిశ్చ యింపబడిన యీ వరునకు - సద్బ్రాహ్మణునకు ఆదరముతో సుందరి యైన నాకుమార్తెనిచ్చి వివాహము చేయుచుంటిని గాన ఈ వధూ వరులిర్వురు దాంపత్యప్రేమను పొంది సుఖింతురుగాక." అనిపల్కుచు కన్యాదానము చేసినచో నావివాహము ప్రాజాపత్యమని కవి చెప్పి యున్నాడు.

---

1 బహువిధం = బహువిధం, 2 దక్షిణయాఽద్వితీయవిధినా
3 దోభ్ఖ్యాం 4 సంపద్య యోగం సదా

—: బ్రాహ్మవివాహలక్షణం :—

శ్లో. ఆహూయార్చనపూర్వకం ద్విజవరాయాఽచ్ఛాద్యవాసోవరైః
విద్యాశీల వివేక వంశవినయా చారాన్వితాయ స్వయం
కన్యాప్రీతిమతే వరాయ విధినాయద్దీయతే సాదరం
బ్రాహ్మోఽసౌమునిపుంగవై ర్నిగదితః శ్రేష్ఠోవివాహోఽపరః. 14

తా. విద్యా - శీలము - వివేకము - సద్వంశము - వినయము- సదాచారము - గల సద్బ్రాహ్మణవరుని - వస్త్రములు మొదలగు వానితో పూజించి- తోడ్తెచ్చి ప్రేమపాత్రుడైన యా వరునకు - తన కుమార్తెనిచ్చి వివాహముచేసిన యెడల నది బ్రాహ్మవివాహ మన బడునని మునులు చెప్పినారు.

ఈ వివాహము శ్రేష్ఠమని మునీశ్వరులు చెప్పిరి.

—; గాంధర్వాది వివాహత్రయలక్షణము :—

శ్లో. కన్యా 1యౌవనశాలినీ పతిమముం యా స్వీకరోతి స్వయం
గాంధర్వః సహి కథ్యతే భుజబలాదాకృష్యతే యత్నవః
జ్ఞేయో రాక్షస ఏష పండితవరైః శ్చౌర్యాద్వివాహోఽపరః
పైశాచః కవిశేఖరేణ కథిత స్త్యాజ్యః సదా యత్నతః. 15

తా. యౌవనవతియగు కన్య పతిని స్వయముగ నెన్నుకొని స్వీకరించినచో నది గాంధర్వవివాహమగును. బాహుబలము నుప యోగించి కన్యనుగొనిపోయి వివాహమాడినచో నది రాక్షసవివాహ మగును. కన్యను దొంగిలించుకొనిపోయి వివాహమాడిన నది పైశా చికమగును కాని ఈ పైశాచిక వివాహము సర్వదా త్యజింపతగినది.

శ్లో. ఆదాయ ప్రథమం వరాద్బహుతరం శుల్కం యథా కాంక్షయా
వస్త్రాలంకృతి భైర్భవేన తనయా సంతోషముత్పాద్య చ
పశ్చాద్దుష్కులసంభవాయ మలినం కన్యాప్రదానం వృథా
2ప్రఖ్యాతోఽధమ వంశజా పరిణయ స్సజ్ఞైరసావాసురః. 16

పా. 1 యౌవనకామినీ
2 ప్రఖ్యాతోనిజవంశజా

తా. ముందుగా వరునివలన తన ఇష్టానుసారముగ కోరినధనము పుచ్చుకొని తరువాత తనకుమార్తెకు వస్త్రాభరణాదులచే సంతుష్టి కలుగజేసి తదనంతరము మా కులహీనుడైన వరునకు కన్యాదానమొసంగుట అసురవివాహ మనబడును ఇట్టి కన్యాదానము నింద్యమనియు వ్యర్థమనియు స్మృతులు చెప్పుచున్నవి “ అసురంద్రవిణాదానాత్ ” అని శాస్త్రము విధింపుచున్నది.

-: పరస్త్రీగమననిషేధము :-

శ్లో. అశ్రోత్తామపహాస్యతాం మలినతామర్థక్షయం లాఘవం
గర్హాంగ్లానిమధోగతిం వికలతామాయుఃక్షతిం దుర్గతిం
ఇద్ధం యే పరదారకర్మణి రతాలోకత్రయే నిందితా
విందంతే పరమాపదః సుఖధియా దుఃఖం నరా స్తేసదా. 17

తా. పరస్త్రీ గమనమువలన పురుషుడు సంఘములో నింద్యుడుగా నెన్నబడును. ఎవరును గౌరవించరు. తుచ్ఛుడని తలంతురు. ధననష్టము - ఆయువు క్షీణించుట - అధోగతి - వైకల్యము ప్రాప్తించును. పరస్త్రీ గమనమును కోరినపురుషుడు కష్టములపాలై ఇహ పర సుఖములకు రెండింటికి చెడును. వేరొక శరణ్యముండదు. గనుక పరస్త్రీగమనము త్యాజ్యమనిభావింపవలయును.

శ్లో. పౌలస్త్యః సురదైత్య మర్త్యముకుట వ్యాఘృష్ట పాదాంబుజో
మైథిల్యాహరణా దవాప మరణం వాలిశ్చ్యుతో రాజ్యతః
పాంచాలీ ప్రతికాంక్షితేన నిధనం భీమాన్మృతః కీచకః
తస్మా దన్యవధూ ర్నరై ర్నమనసా ప్యాలాపనీయా భువి 18

తా. రావణాసురుడు దేవదానవ మానవులకు భయంకరుడై యుండియు సీతాపహరణము వలన మరణించెను, సకుటుంబముగ నాశనమయ్యెను. వాలి సోదరభార్యయైన రుమను అధర్మముగా గ్రహించినందున రామబాణమున హతుడయ్యెను. పాంచాలిని కోరుటచే కీచకుడు భీమునిచే హతుడయ్యెను. కనుక పరస్త్రీగమనమును మనస్సులోనైన కోరరాదు.

—: దశావస్థాలక్షణము :—

శ్లో. చక్షుః ప్రీతిరుదీరితా ప్రథమత[1]శ్చిత్తభ్రమః స్యాత్తతః
సంకల్ప స్తదనంతరం నిగదితో నిద్రావినాశ స్తథా
వైరాగ్యం [2]విషయేషు కీర్తనమతో వ్రీడానివృత్తి స్తతో
[3]హ్యున్మాదో మరణం దశప్రకటితాః కందర్పచేష్టా ఇతి. 19

తా. మన్మథావస్థలు పదిగా చెప్పబడినవి. ప్రథమమున చూచి వలచుట - రెండు చిత్తభ్రమము - మూడు సంకల్పము - నాల్గు నిద్రలేకుండుట - అయిదు విషయవిరాగము - ఆరు చిక్కిపోవుట - ఏడు సిగ్గు విడుచుట - ఎనిమిది ఉన్మాదము - తొమ్మిది జడత్వము - పది మరణము - ఇవి పదివిధములైన అవస్థలు.

శ్లో. కామిన్యా నవయౌవనే నమిలతి స్వేచ్ఛావిహారో నృణాం
ఉన్మాదో మరణం తదా మనసిజవ్యామోహాతో జాయతే
తస్మా త్తద్వినివారణాయ పురుషై [4]రన్యాంగనా కామిభిః
[5]గంత్యేవ్యేతి వదంతి[6]కాశ్యపముని క్షేమేంద్రవాత్స్యాయనాః. 20

తా. యువకులకు నవయౌవనమందు స్వేచ్ఛగా సుఖించుటకు తగిన స్త్రీ లభింపనియెడల - మోహామధికమై చివర కున్మాద మరణములకుగూడ హేతువగును. కనుక అంత ప్రాణాపాయస్థితి కలుగునని భయముండినప్పుడు పరస్త్రీగమనము చేయవలయునని కాశ్యపుడు - క్షేమేంద్రుడు - వాత్స్యాయనాదులు - చెప్పినారు.

శ్లో. తారాపీడసుతో వినాశమగమ త్కాదంబరీ కాంక్షయా
వ్యాముక్తః కిల పుండరీక మునిరప్యచ్ఛ్ర్మహా శ్వేతయా
ఊర్వశ్యాచ పురూరవా నరపతిః సన్త్యాజితో జీవితం
[7]తస్మాజ్జీవిత రక్షణాయహి వినిర్గమ్యా పరప్రేయసీ. 21

తా. కాదంబరిని మోహించి చంద్రాపీడుడు నాశనమయ్యెను. మహాశ్వేతను మోహించి పుండరీకముని మరణించి శుకమయ్యెను.

---

1 శ్చిత్తస్థితి 2 విషయస్యకీర్తనమతో 3ఒత్యున్మాదో 4రన్యాంగనాచాత్మభిః 5 దృష్టవ్యేతి 6 కాశ్యప మరు క్షేమేంద్రవాత్స్యాయనః.
తస్మాద్గ్రాహితజీవితం బహువిధం సంత్యాజితం రాజభిః.

ఊర్వశికొరకు పురూరవుడు మరణించెను. కావున కామవాంచవలన ప్రాణభీతికలుగుననే సంశయము తోచినచో పరస్త్రీగమనము చేయ వలయునని కొందరిమతము.

-: దూతికాలక్షణము :-

శ్లో. దాసీ వారవధూ ర్నటీ సవిధవా బాలాచ ధాత్రీ తథా
కన్యా ప్రవ్రజితాచ భిక్షువనితా సంబంధినీ శిల్పినీ
మాలాకారనితంబినీ ప్రతిసఖీ దూత్యేస్స్మృతా 1యోషితాం
2ఆలాపే కవిభిః సదైవ మదనవ్యాపార లీలావిధౌ. 22

తా. దాసి, వేశ్య, నటి, విధవ, బాల, దాది, సన్యసించినది, భిక్షుకురాలు, సంబంధిని, శిల్పినీ, మాలలుకట్టునది, స్నేహితురాలు, వీరు దూతికాకృత్యమునకు తగినవారు.

-: సుఖసాధ్యనాయికాలక్షణము :-

శ్లో. ప్రౌఢా కాంతవిమానితా బహుగుణా రమ్యాచ పత్యాతథా
రండా స్వైరపరా స్వతంత్రగమనా 3శిల్పప్రియా గాయికా
షండోన్మత్త దరిద్రసేవక 4మహారోగార్త డింభాంగనా
నూనంసిధ్యతి దూతికా నిగదితా రమ్యాభిసారోత్సవే. 23

తా. ప్రౌఢస్త్రీ - పతిచే అవమానింపబడినది - అనేకగుణ ములుకలది - అతిసుందరి - విధవ, స్వతంత్రస్త్రీ, స్వేచ్ఛగాతిరుగునది చిత్తరువులు మొదలగు శిల్పకళలయందు ప్రీతికలది - సంగీతముపాడు నది, షండుడు - ఉన్మత్తుడు - దరిద్రుడు సేవకుడు - రోగి - పిన్న వయస్సువాడు వీరలభార్యలు తప్పక శీఘ్రముగ అప్రయత్నముగ కాముకులకు సాధ్యలగుదురు.

-: కష్టసాధ్యనాయికా లక్షణము :-

శ్లో. ఏకా వల్లభరక్షితా పరజనాలాపే విరక్తా దృఢా
5నిస్స్నేహా ధనయౌవనే గురుజనాద్భీతాచ లజ్జావతీ

---

1 యోషితః, 2 ఆలాపాః 3 శిల్పప్రియాగాయినీ,
4 వధూః రోగార్తిసంపీడితా: 5 నిస్స్నేహాగురుయౌవనా,

స్వస్థా సుందరనాయకా పతిరతా శిష్యార్థికాంతా తథా
దుస్సాధ్యా కవిశేఖరేణ రమణీ ప్రోక్తా [1]రతిప్రార్థనే. 24

తా. భర్తచే రక్షింపబడునది - ఇతరులతో మాట్లాడుట యందు విరక్తికలది - దృఢప్రతిజ్ఞగల కామిని - ధనయౌవనముల యందు వాంఛలేనివనిత - గురుజనములకు భయపడునది. లజ్జావతి- స్వస్థురాలు - సుందరుడైన పతిగలది - పతివ్రత- శిష్యునిభార్య వీరు - కాముకులకు కష్టసాధ్యలు. అనగా దుస్సాధ్యలని యర్థము.

-: అగమ్యాలక్షణము :-

శ్లో. అజ్ఞాతా ద్విజవల్లభా గురువధూ మిత్రాంగనా రోగిణీ
చేటీ ప్రవ్రజితాసతీ రిపువధూః శిష్యాచ గర్భాన్వితా
భ్రూణఘ్నీ మృతసంతతిః ఖలజనా చాస్పృశ్యజా [2]గోత్రజా
గంతవ్యా [3]నకదాచిదేవ పురుషైః రేతాః స్త్రియః కామిభిః. 25

తా. అజ్ఞాత (తెలియబడనిది) బ్రాహ్మణస్త్రీ - గురుపత్ని మిత్రునిభార్య - రోగిణి - దాయి - సన్యాసిని - పతివ్రత - విరోధి భార్య - శిష్యురాలు - గర్భిణి - భ్రూణహత్యచేసినది - చనిపోయిన సంతతికలది - దుష్టురాలు - అస్పృశ్యకులోద్భవ - సగోత్రజ - ఈ స్త్రీలు పురుషులకు పొందతగనివారు. కాముకులు ఇట్టి స్త్రీలను పొందుటకు ప్రయత్నింపరాదు.

-: రతికి పనికిరాని స్థానములు :-

శ్లో. నద్యాం దేవగృహే చతుష్పథవటే శైలస్యసానౌ జలే
గుర్వగ్ని ద్విజసన్నిధౌ పరగృహే దుర్గే శ్మశానే వనే
సంధ్యాయాం దివసే కదాపిసురతం పుంభిర్వివేకాన్వితైః
[4]దృష్ట్వా ధర్మవిరోధసంకటమితిత్యాజ్యంసదాయత్నతః. 26

తా. నదీతీరము - దేవాలయము - నాలుగుమార్గములు కలిసినకూడలి - కొండలోయ - జలములోపల - " గురువు - అగ్ని-

1 రతప్రార్థనే
2 యోగినీ, 3 నకదాపితత్ర
4 దృష్ట్వానేన

బ్రాహ్మణుడు " వీరల సమీపప్రదేశము - పరగృహము - కోట శ్మశానము - వనము - ఈ ప్రదేశములయందు - పగలు . సంధ్యా కాలములలో సంభోగము చేయరాదు. అట్లుచేయుట ధర్మవిరుద్ధము గనుక వివేకియగువాడు విచారణ సేయవలయును.

శ్లో. అష్టమ్యాం హిమరశ్మి శేఖర తిథౌ బాణేచ పూర్ణాతిథౌ
భానోస్సంక్రమణే వ్రతేచ శరది గ్రీష్మేషు హాయామపి
యాతాయాతపరిశ్రమే జ్వరగదే సంభోగచేష్టాం నరః
కుర్యాన్నైవకదాచిదేవ సుకృతీత్యాహుర్మునీంద్రాఃస్ఫుటం.27

తా. అష్టమి - చతుర్దశి - పంచమి - పూర్ణిమ - సంక్రాంతి వ్రతదినములు-శరదృతువు - వేడిగానుండుదినములు - గ్రీష్మకాలములు రాకపోకలలో అలసటజెంది యున్నప్పుడు - జ్వరముపడియున్నప్పుడు సంభోగము చేయరాదని మునీంద్రులు చెప్పిరి.

-: రతికి యోగ్యస్థానములు :-

శ్లో. స్ఫూర్జద్దీప శిఖోజ్జ్వలే సులలితే రమ్యోన్నతే 1సుస్తరే
ధూపోద్గార మనోహరే 2కుసుమసృగ్దామోప శోభాన్వితే
వీణాతాల రవాకులే మనసిజ ప్రస్తావనానందితే
సంభోగః కుశలైః స్వకీయభవనే కార్యో యథాకాంక్షయా. 28

తా. బాగుగా నలంకరింపబడినట్టియు- దీపములతో ప్రజ్వలించు చున్నట్టియు - సువాసనద్రవ్యములతో పొగవేయబడి పరిమళించు చున్నటువంటి స్వగృహములోని పడుకగదిలో పుష్పమాలిక లలంక రింప బడియుండ సంగీతవాద్యములు మ్రోగుచుండ మన్మథప్రసంగ ములతో ప్రతిధ్వనించుచుండ సంతసమునిచ్చునట్టి యా ప్రదేశమందు కాముకుడు ప్రియురాలితో భోగింపవలయును.

-: స్త్రీలకామచేష్టల నెరుంగువిధము :-

శ్లో. 3ఉక్తా గచ్ఛతి లజ్జితా విరమతి ప్రేమ్ణా మనాగీక్షతే
4కేశానాంచ విజృంభణం రచయతి ప్రస్తౌతి గాథాంముహుః

1 విస్తరే, 2 సుకుసుమసృగ్దామశోభాన్వితే
పా. 3 మూకాగచ్ఛతి, 4 కేశాగ్లుంచతి జృంభణం

ఆలింగత్యపరాం విరౌతి పురుషం చుంబత్యసౌ బాలకం
గాత్రం భంజతి జృంభతే విహసతి ప్రత్యుత్తరం యాచతే. 29

తా. మాట్లాడుచునడచుట - సిగ్గుతో నిలువబడుట - ప్రేమ వీక్షణములతో చూచుట-తలకట్టు ముడుచుకొనుట - ఆవులించుట- సంగీతముపాడుట - ప్రక్కనున్న వారిని కౌగలించుకొనుట - అప్పు డప్పుడు వెక్కి వెక్కి యేడ్చుట - ప్రక్కనున్న బాలకుని కౌగలించుకొని ముద్దు పెట్టుకొనుట - ఒళ్ళువిరుచుకొనుట - నవ్వుట - ప్రత్యుత్తర మునకై నిరీక్షించుట- ఈగుణములుగల స్త్రీ కామపీడితయని యెరుంగ వలయును.

శ్లో. దోర్మూలం ఖలుదర్శయేత్ స్తనయుగే వస్త్రం సమాలంభతే
అంగుష్ఠేన లిఖేన్మహీం స్మితముఖీం వ్రీడాం విధత్తే మృషా
దంతేనాధరపల్లవం విదశతి వ్యక్తం తదాభాషతే
భావై రేభి రిహాస్ఫుటం మృగదృశాం జ్ఞేయోఽభిలాషస్సదా. 30

తా. పరపురుష వాంఛగలపడతి బాహువులనెత్తి కక్షము లను (చంకలను) చూపును. స్తనములపై వస్త్రమును సర్దుకొనును. శిశువునకు పాలిచ్చుదానివలె స్తనములను చూపుచు పైటసర్దుకొనును. కాలిబొటనవ్రేలితో నేలపై వ్రాయును. నిష్కారణముగ నవ్వును. కపటపు సిగ్గునభినయించును. దంతములతో అధరోష్ఠమునునొక్కును. భావప్రకటన మగునట్లు స్ఫుటముగమాట్లాడును. ఈలక్షణములను గమనించి పురుషుడు స్త్రీల వాంఛను తెలుసుకొనవలయును.

—: ఆలింగనవిధానము :—

శ్లో. మాల్యాపూరిత కుంతల స్సువసనః స్నిగ్ధాంగరాగోజ్వలో
నానాభూషణసుందరః [1]స్మరవశ స్తాంబూల పూర్ణాననః
స్ఫూర్జద్దీప మనోజ్ఞ వాసభవనే శయ్యాతలే నాయకో
రాగార్థం పరిరంభణం ప్రథమతః కుర్యాత్సమంయోషితా. 31

తా॥ నాయకుడు ప్రకాశమానమై సుందరముగ నలంకరింప బడిన స్వకీయమైన కేళీగృహములో సుందరములైన పుష్పమాలికలను

పా. 1 స్మరరస

శుభ్రవస్త్రములను సువర్ణాభరణములను వ్రేళ్ళకుంగరములను ధరించి తాంబూలమునువేసికొని ముఖమునకు శరీరమునకు సుగంధద్రవ్యములను లేపనముచేసికొని కామోన్మత్తుడై ప్రియురాలిని సంతోషముగా గాఢాలింగనము చేసికొనవలయును.

—: ఆలింగనభేదములు :—

శ్లో. వృక్షారూఢక సంజ్ఞకం ప్రథమత స్తస్మా ల్లతావేష్టితం
తస్మా జ్జాఘన విద్ధకావపి మతావూరూపగూఢం పునః
జ్ఞాతవ్యం తిలతండులం రసవిదా మాలింగనం యోషితాం
క్షీరం నీర పురస్సరం నిగదితం తస్మాచ్చ లాలాటికం. 32

తా. వృక్షారూఢకము - అనగాచెట్టెక్కిన విధముగ ప్రియుని ఆలింగన మొనర్చుకొనినచో వృక్షాధిరూఢకమనబడును. నాయిక నాయకుని శరీరమును చెట్టుకు చుట్టుకొనిన తీగవలె నల్లుకొనిపోవుట లతావేష్టితమగును. పిక్కలు కలియునట్లు ఆలింగనమొనర్చుకొనినచో జాఘనవిద్ధకమనబడును. అదేవిధముగ ఇర్వురితొడలు కలియునట్లాలింగనమొనర్చిన ఊరూపగూఢమగును. ఇంకను - తిలతండులము - క్షీరనీరము - లాలాటికము అను నాలింగనములు కూడ రసికులు చేయుచుందురు.

—: వృక్షాధిరూఢలక్షణము :—

శ్లో. ఏకేన పాదేన పదం స్వభర్తు
రన్యేనచాక్రమ్య తదూరుభాగం
ఆపీడ్య దోర్భ్యామపి కాస్తపృష్ఠం
వృక్షాదిరూఢం ప్రవదంతి తజ్ఞాః. 33

తా. స్త్రీ తనపాదమును పతిపాదముపైనుంచి రెండవపాదముతో పురుషుని తొడలను చుట్టివేసి రెండుచేతులను వీపుపైనుంచి యాలింగనము చేసినయెడల వృక్షాధిరూఢమని పండితులుపల్కిరి.

—: లతావేష్టిత లక్షణము :—

శ్లో॥ ఊర్ధ్వంభుజాభ్యాం సరలాంగయష్టి
క్షోణీరుహం వల్లిరివాధిరుహ్య

నారీప్రియం చుంబతి నిస్తరంగా
భవేల్లతావేష్టిత సంజ్ఞకం తత్. 34

తా. తీగె చెట్టున కేవిధముగ చుట్టుకొనునో అదేవిధముగ స్త్రీ ప్రియుని కంఠమును రెండుచేతులతో కౌగలించుకొని చుంబించుచు నాయకుని దేహమును ఆలింగనమొనర్చుకొనుటకు లతావేష్టితమనబడును.

—: జాఘనలక్షణము :—

శ్లో. శ్రోణీతటే బాహుయుగేన కాంత
మాపీడ్య ముక్తాంబర కేశభారా
వక్త్రాసవం స్వాదయతి ప్రహృష్టా
తజ్జ్ఞైః స్ఫుటం జాఘన 1 మేతదుక్తం. 35

తా. స్త్రీ విడువబడిన కేశపాశము - వస్త్ర విహీనయై నాయకుని కటిప్రదేశమునందు రెండుబాహువులను వైచి దృఢాలింగన మొనర్చుకొని ఆనందమగ్నయై అధరపానము జేసినచో దానిని జాఘనమను ఆలింగనముగా చెప్పబడినది.

—: విద్ధకలక్షణము :—

శ్లో. 2సుఖోపవిష్టం పురుషం పురంధ్రీ
సమ్మీలితాక్షం స్వకర ప్రబంధాత్
అవిధ్యతి ప్రేమలసత్కుచాభ్యాం
3ఆలింగనం విద్ధక మేతదాహుః. 36

పా. 1. మేతదేవ, 2 స్థితోపవిష్టం

3 సిద్ధార్ధమాలింగనమేతదాహుః, అని కొన్ని ప్రతులలో పాఠాంతరమున్నది గాని అది సమంజసముకాదు సిద్ధార్ధమను పేరుగల ఆలింగనలక్షణము పూర్వగ్రంధములయందు లభింపకపోవుటవలనను రతిరహస్యమున కొక్కోకుడు వ్రాసిన విద్ధకలక్షణమునకు సాదృశ్యముండుటచేతను మరికొన్ని ప్రతులలోని పాఠములకు విరోధముగా నుండుటచేతను విద్ధకమనియే వచింపబడెను.

రతిరహస్యోక్త విద్ధకలక్షణము

శ్లో. యద్గృహ్ణాతి కించన వంచితాక్షంస్థితోపవిష్టం పురుషం స్తనాభ్యాం
నితంబినీ విధ్యతి తాంచ గాఢం గృహ్ణాత్యసౌ విద్ధకముచ్యతేతత్.

తా. అలసివచ్చి విశ్రాంతిగా కనులుమూసుకొని కూర్చున్న నాయకుని ప్రియురాలు (అనగా భార్య) భుజములతో బంధించి స్తనములతో ముందునకు త్రోసినచో నది విద్ధకమను ఆలింగనమగును.

—: ఊరూపగూఢము :—

శ్లో. కాంతో మనోజ[1]న్యథితాంగ యష్ట్యా
ఆపీడయే దూరుయుగం యువత్యాః
ఊరూపఘాతేన కవిప్రవీరై
రూరూపగూఢం తదిదం ప్రదిష్టం. 37

తా. నాయకుడు కామపీడితుడై ప్రియురాలి తొడలతో తన తొడలను కలిపి త్రోయుచు నాలింగనమొనర్చుకొనినచో నది ఊరూపగూఢమగును.

—: తిలతండుల లక్షణము :—

శ్లో. బాహూరు వక్షోజ ఘనేనగాఢ
మన్యోన్యసంసక్త శరీరయష్ట్యోః
ఆనందభావా ద్వ్యదుదీర్ణ భావ
మాలింగనం తత్తిలతండులాఖ్యం. 38

తా. స్త్రీపురుషులిర్వురు తమయవయవములను పరస్పరము కలుపుకొని ఏకమగునట్లు గాఢముగా ఒకరినొకరు కౌగలించుకొనినచో నది తిలతండలమని చెప్పబడును.

—: క్షీరనీరము :—

శ్లో. గాత్రోపరిష్టా దథతల్పమధ్యే
సంలీయతే [2]యన్మిథునం శరీరే
[3]కామాతిరేకాత్ కృతపూర్ణ చేష్టం
ఆలింగనం క్షీరజలం ప్రదిష్టం. 39

1 వ్యథితాంగయష్టిః

1 శ్లో. యద్బాహు వక్షో జఘనేన గాఢమన్యోన్యసంసక్త శరీర యష్ట్యోః
కాంతస్య గాఢం సముపాకృతో యమాలింగనం తత్తిలతండు లాఖ్యం.

2 తన్మిథునం, 3 కామాభిమానాత్

తా. స్త్రీపురుషు లిర్వురు శయ్యపై నుండి శరీరములు రెండు కలిసిపోవునట్లు కౌగిలించుకొని కామాతిరేకమువలన మన్మథచేష్టలు చేసినచో నది క్షీరనీరమను నాలింగనముగా చెప్పబడెను.

—: లాలాటికము :—

శ్లో. అన్యోన్యసంసక్త ముఖంచ బాహూ
నేత్రం లలాటం హృదయం కపోలం
ఆనందభావ శ్రిమమీలితాక్షం
లాలాటికం తత్త్వవిదో వదంతి. 40

తా. స్త్రీపురుషులిర్వురుపరస్పరము సంతోషముతో కన్నులు మూసుకొని ముఖములు - బాహువులు - హృదయములు - నేత్రములు - కపోలములు అంటునట్లు - కలుపుకొనినచో అయ్యది లాలాటికమని తత్త్వవిదులు పల్కిరి.

-: చుంబనప్రయోగము :-

శ్లో. గండస్థలీ మస్తక దంత వాసో
గ్రీవా కుచోరః1 స్తన చూచుకాని
ఆలింగనానంతర మేవ యూనోః
స్థానాని చుంబస్య వదంతి 2తజ్ఞాః. 41

తా. కపోలములు - మస్తకము - అధరము - కంఠము - స్తనములు - స్తనోపరిభాగము . వక్షస్థలము - స్తనాగ్రములు - చుంబనస్థానములు. ఆలింగనానంతరము నాయకుడు ప్రియురాలిని పై స్థానముల యందు చుంబనము సేయవలయును.

శ్లో. కక్షాయుగం చాపి నితంబినీనాం
3కందర్పగేహించ రతిప్రవీణాః
చుంబంతి కామం తరలాయతాక్ష్యో
దేశస్య సాత్మ్యేన సదైవ లాటాః. 42

1 స్థల, 2 స్తనః 3 కందర్పరాగస్ఫురణప్రవీరాః

తా. లాటదేశమందలి కాముకులు ప్రియురాండ్ర మదన మందిరములను (యోని) బాహుమూలములను (చంకలు) చుంబింతురు. ఇది ఆదేశపు పద్ధతి.

-; నిమిత చుంబనము ;-

‡శ్లో. కాంతో౽ంగనాయా వదనే స్వకీయం
1వక్త్రం సమారోప్య బలేన యత్ర
నచుంబతి క్రోధవశేన నారీ
స్యాచ్చుంబనం తన్నిమితాభిధానం. 43

తా. పురుషుడు స్త్రీయొక్క ముఖమందు తనముఖమునుంచి చుంబింపగా నామె కోపముతో తిరిగి చుంబింపకపోయినచో నది నిమితమను పేరుగల చుంబనమగును.

—: స్ఫురిత చుంబనము :—

శ్లో. పత్యుర్ముఖే 2స్వీయముఖం నివేశ్య
ప్రేమ్ణా మనా3గంచతి దంతవాసః
ఉచ్చైన గృహ్ణాత్యపి కంపితోష్ఠీ
ప్రోక్తం మునీంద్రైః స్ఫురితం వినోదాత్. 44

తా. వినోదముగా స్త్రీ తనముఖమును పతిముఖముపై నుంచి ప్రేమతో మెల్లగ చుంబించుచు కంపితాధరోష్ఠియై నాయకుని దృఢాలింగన మొనర్చినచో నది స్ఫురితచుంబనమగును.

—: ఘృష్టచుంబనము :—

శ్లో. హస్తేననేత్రం పరిమీల్య భర్తుః
సమ్మీలితాక్షీ వదనే స్వజిహ్వాం

---

1 స్వకీయ మాక్షిప్యవక్త్రంకుతుకేనయత్ర

‡నిమితచుంబనలక్షణము రతిరహస్యము వేరుగా వర్ణింపబడియున్నది ఎట్లనగా!

శ్లో. నిమితక మిదమాహుర్వ్యాజితా యద్భవేన
ప్రియముఖమభివక్త్రం న్యస్య తిష్ఠత్యుదాస్యా.

పా. 2 తు స్వముఖంనివేశ్య, 3 గంచతిదంతవేష్టం

నిక్షిప్యచ క్రీడతి యత్ర లోలా
ఖ్యాతం రసజ్ఞైః ఖలు[1]ఘృష్టసంజ్ఞం. 45

తా. స్త్రీ చేతులతో పతినేత్రములనుమూసి అతని వదనమందు నాలుకనుంచి త్రిప్పుచుండినయెడల ఘృష్టమను పేరుగలచుంబనమగును

—: పీడితచుంబనము :—

శ్లో. హస్తాంగులీ సంపుటకేన యత్ర
కాంతోష్ఠ మాదాయ రసజ్ఞయాచ
ఆస్వాదయే న్నిర్దశనం వినోదాత్
స్యాచ్చుంబనం [2]పీడిత మేతదేవ. 46

తా. స్త్రీ తనరెండుచేతులతో పతియొక్క అధరోష్ఠమును గ్రహించి ఆస్వాదించుచు - దంతక్షతముచేసి చుంబించిన యెడల పీడితమను చుంబనమగును.

—: సంపుటచుంబనము :—

శ్లో. [3]కాంతాధరం స్వాధరసంపుటేన
పీత్వా ముహుః స్వాదయతి క్రమేణ
నారీచ తేనైవ విధానకేన
జ్ఞేయం మునీంద్రై రితిసంపుటాఖ్యం. 47

తా. పురుషుడు తనపెదవులతో స్త్రీయొక్క అధరోష్ఠమును గ్రహించి చుంబించుచుండగా నామెయు వెంటనే ప్రియుని యధరము నదేవిధముగ చుంబించినచో నది సంపుటమను చుంబనమగును.

—: సమోష్ఠచుంబనము :—

శ్లో. ఓష్ఠేన కాంతోష్ఠయుగం నిపీయ
జిహ్వాం నిధాయా ప్యధ తాలుభాగే

---

పా. 1 రతిరహస్యమందు ఘృష్టమను పేరుగల ఆలింగనము ఘట్టితమను పేరుతో నిర్దేశింపబడెను

పా. 2 అంగులిసంపుటేన పిండీకృత్య నిర్దశన మోష్ఠపుటే నావపీడయేదిత్యవ పీడితం పంచమమపికరణం ఇతివాత్స్యాయనీయసూత్రనిర్దిష్టం పీడితలక్షణ మనుకరోతి లక్షణమేతత్. 3 కాన్తాముఖం

చుంబోత్సవే నృత్యతి యత్ర నారీ
ప్రోక్తం సమాష్ఠం మునిభిః పురాణైః. 48

తా. స్త్రీ పురుషుని యధరోష్ఠమును తనపెదవితో గ్రహించి యధరపానమొనర్చుచు నతని దవడలయందు నాలుకనుంచి ఆనంద ముతో నృత్యముచేసినచో నది సమాష్ఠమను పేరుగల చుంబనమగును.

—: నఖక్షతప్రయోగము :—

శ్లో. కక్షా[1]కుచోరస్థల కుక్షినాభి
శ్రోణీ లలాటాంఘ్రి కరేషు సద్యః
సాంగుష్ఠ సర్వాంగులికైశ్చ సర్వైః
[2]సంయుక్తపఃః స్తనకంధరాహా. 49

తా. బాహుమూలము - (చంకలు) స్తనములు - వక్షస్థ లము - కడుపు - నాభి - కటిప్రదేశము - తల - పాదము ఈ ప్రదే శములయందు చేతి అయిదువ్రేళ్ళతో నఖక్షతములు చేయవలయును.

—: ఛురితాఖ్య నఖక్షత లక్షణము :—

శ్లో. [3]సంజ్ఞాపకం మన్మథరాగ రాశే
రుక్తం మునీంద్రై శ్ఛురితాభిధానం
వక్షోజ కందర్ప గృహాధరేషు
దేయం నవోఢా ప్రమదాజనానాం. 50

తా. మన్మథ సంబంధమైన అనురాగ సూచకముగ చురిత మను నఖక్షతము చేయవలయునని వాత్స్యాయనాదులు చెప్పిరి. అందువలన నవయువకులు నవోఢలైన స్త్రీయురాండ్రయొక్క వక్ష స్థలము - స్తనములు - కామగృహము - అధరము - వీనియందు నఖక్షతము లుంచవలయును.

—: అర్ధేందు నఖక్షతలక్షణము :—

శ్లో. కండూయనేనైవ శిరోరుహాణా
మస్యోపయోగం పరికీర్తయంతి

1 కుచోరుస్థల 2 సేవ్యస్సదైవ + సేవ్యస్సపః
3 సంస్థాపనం

అర్థేందుసంకాశ మిదం నఖజ్ఞై
రర్థేందుసంజ్ఞం కథితం సమాసాత్. 51

తా. తలయొక్క దురదతీరుటకుగాను గోకికొనుటకే నఖము లుపయోగకరములని చెప్పుచున్నారు. కాని నఖచిహ్నము లనేక ప్రకారములగుటచే అర్థచంద్రాకృతిగల నఖచిహ్నమునకు అర్థేందు అనియు నీవిధముగా పెక్కునామములుగలవు.

—: మండలనఖక్షతము :—

శ్లో. కక్షానితంబస్తనపార్శ్వకేషు
దాతవ్యమేత త్కరజం సదైవ
అర్థేందు సంజ్ఞాద్వితయం ప్రయుక్తం
స్యాన్మండలాఖ్యం మదనావతంసం. 52

తా. చంకలు - పిరుదులు - స్తనములు - వీనియొక్క పార్శ్వ ప్రదేశములయందు - అర్థేందు- మండల - అనురెండువిధములైన నఖ క్షతములను చేయవలయును.

—: శశకప్లుత నఖక్షతము :—

శ్లో. ఊరూతటే కామగృహే నితంబే
ప్రోచు ర్మునీంద్రా వినియోగ మస్య
సమైశ్చ సర్వైర్నఖరై సులగ్నైః
తజ్జ్ఞః కిలోక్తం శశకప్లుతాఖ్యం. 53
సీమంత పార్శ్వే హృది 1చూచుకాదా
వేతత్ప్రయోజ్యం సురతప్రయోగే.

తా. తొడలు - కామగృహము - నితంబము వీనియందు నఖక్షతములు చేయవలయునని పెద్దలగు మునులు పల్కిరి.

చేతిగోరు లన్నింటిచేతను సమానముగ సుందరముగ నఖక్షత మొనర్చినచో నది శశకప్లుతమగును. పాపిట (సీమంతపార్శ్వము) హృదయము - స్తనాగ్రములు - వీనియందే దీనిని ప్రయోగింపవల యును.

1 చూచుకాదౌ శశ్వత్ప్రయోజ్యం

—: మయూరపాదలక్షణము :—

శ్లో. [1]సర్వైర్నఖైర్వా స్తనమధ్య భాగే
పశ్చాదథాంగుష్ఠ[2] భవాహి రేఖా.  54
వ్యక్తీకృతా [3]రాగకరీ తదేత
న్మయూరపాదం సముదీరయంతి.

తా. స్తనమధ్యభాగమం దన్నిగోరులతో నఖక్షతముచేసిన పిదప బొటనవ్రేలి గోటితో క్రిందుగ నఖరేఖనుంచినయెడల నది మయూరపాదమను నఖక్షతమగును. ఈ నఖక్షతము అనురాగకరము.

—: పంకజపత్రిలక్షణము :—

అలంబమేవం స్ఫురితార్థరేఖం
ప్రాహుః క్షతం పంకజపత్రిసంజ్ఞం.  55
దోర్మూల వక్షస్థల నాభిసందా
వస్యోపయోగం వదతే మహేశః.

తా. నఖరేఖలన్నియు సగము ఏర్పడి దీర్ఘములు కాకుండిన యెడల కమలపత్రమను నఖక్షతమగును. చంకలు - వక్షస్థలము - నాభి సంధి - ఈస్థానములయందే ఈనఖక్షతమున కుపయోగము అని మహేశుడను కామశాస్త్రజ్ఞుడు చెప్పెను.

—: దర్దురక లక్షణము :—

శ్లో. రేఖాయుగం గండయుగే ప్రదత్తం
స్తనాంత కక్షా జఘనస్థలేషు
దేశాంతరం గచ్ఛతి కామినీనాం
సంస్మారకం దర్దురకం వదంతి.  56

ఈ శ్లోకమునకు పాఠాంతరము.

శ్లో. రేఖాయుగం చోజ్వల కామభావః
స్తనేచ కక్షా జఘనాంతరేషు

1 సర్వాంగుళికాగ్రిదనఖైః స్తనాంతః
2 భవేనరేఖా 3 యామునయా స్తదేతన్

విశ్లేష దేశాంతరగేచ నారీ
సంస్మారకం దర్దురకం వదంతి.

తా. చెక్కిళ్ళయందు రెండు నఖరేఖలుంచి తదుపరి స్తనాంతములు - చంకలు - జఘనము వీనియందు నఖక్షతములుంచినచో నది దర్దురకమను నఖక్షతమగును. ఇది పతి విదేశముల కేగునప్పుడు ప్రియురాలియొక్క స్మారకచిహ్నమని పల్కుదురు.

శ్లో. పుంసశ్శరీరే యువతీకుచేవా
క్షతం నఖస్య ప్రతివీక్ష్య సద్యః
కందర్ప రాగాకుల చిత్తవృత్తి
ర్మునేరపి స్యా[1]త్కిముతేఽపరస్య. 57

తా. పురుషుని శరీరమందుగాని స్త్రీయొక్క కుచములయందు నఖక్షతములను చూచినచో మునీశ్వరునకైనా చిత్తవృత్తి మన్మథాయత్తము కాకమానదుగదా! పరులమాటచెప్పనేల.

శ్లో. సర్వస్వమేవాస్తి మనోభవస్య
ప్రేమ్ణా ప్రయుక్తం కరజం రతజ్ఞైః
నాస్మాద్ద్వితీయం భువిరాగబీజ
మిత్యాహ శీతాంశు [2]కలాకిరీటః. 58

తా. రతికళాభిజ్ఞుడైన పురుషుని ద్వారా ప్రేమపూర్వకముగ నొసంగబడిన నఖక్షతమే మన్మథుని సర్వస్వము. భూమిలో ఇంతకంటె అనురాగబీజము రెండవదిలేదని పరమేశ్వరుడు చెప్పెను.

—: దంతక్షతప్రయోగము :—

శ్లో. దంతప్రకారాశ్చ నఖప్రకారైః
జ్ఞేయా స్సమాఏవ సమైశ్చ సద్భిః
శీత్కార హుంకార [3]విచేష్టితాద్యాః
ప్రాయోవిశేషాః[4] పునరత్రకార్యాః. 59

1 కిముచిత్రమస్య 2 కలాధకేతుః
పా. 3 విచేష్టితాద్యైః, 4 పునరేవకార్యాః

తా. దంతక్షత భేదములు కూడ నఖక్షత భేదములవలెనే తెలిసికొనవలయును. కాని విశేషించి శీత్కార (దంతములు, తాలువులు కలిపి మందమైన నిశ్వాసముద్వారా ఉత్పన్నమగు శబ్దవిశేషము) హుంకారములు అధికముగా ప్రయోగింపబడును.

శ్లో. 1 శ్లథా ఘనా స్త్రీవముఖా స్నమాంగా
రాగస్పృశో నిర్మల దీప్తిభాజః
దంతా ప్రదేయా నఖదానదేశే
వక్త్రాంతరాక్షి ద్వితీయంవిహాయ. 60

తా. దంతక్షతములు - ఒకచోటతక్కువ - ఒకచోట ఘనముగా మరియొకచోట సమానముగా అనురాగ వర్ధకమై యుండవలయును. కాని నేత్రములు - వక్త్రాంతరము - గుహ్యప్రదేశము - వదలి దంతక్షతముచేయవలయును.

—: విద్రుమలక్షణము :—

శ్లో. దంతౌష్ఠ సంయోగవశేన గండే
దంతప్రకారః కిల విద్రుమోఽయం
అభ్యాసయోగా ద్యువతీజనానాం
స్థానాన్యథా క్వాఽపివినోదతస్తు. 61

తా. గండస్థలములయందు దంత - ఓష్ఠసంయోగమువలన దంతక్షతములు పెక్కువిధములుగా చేయబడును. వానిలో పగడమువలెచేయబడిన దంతక్షతమునకు విద్రుమమనిచెప్పబడెను. ఇందులో చెప్పబడిన దంతక్షతములు స్త్రీలయొక్క వినోదమునకై అభ్యాసయోగమువలన నొనర్పదగును. వేరేమియునులేదు.

—: ఖండాభ్రక లక్షణము :—

శ్లో. ఊరుస్థలే కంఠకపోలయుగ్మే
ఖండాభ్రకం మండలతుల్యరూపం
సంశోభతే దంతమిదం యువత్యాః
ప్రాయో మునీంద్రా స్సముదీరయంతి. 62

పా. 1 తథానఖా స్త్రీవముఖాస్సమాంగాః

తా. తొడలయందు - కంఠమందు - చెక్కిళ్లయందు గోళాకారముగా దంతక్షతమొనర్చినచో దానిని ఖండాభ్రకమందురు. స్త్రీల కపోలముల కిది మిక్కిలి శోభనిచ్చును.

-: కోలచర్చాలక్షణము :-

శ్లో. దీర్ఘా సురక్తా క్షత కుంచితాచ
రేఖాస్థలే చూచుకయోః ప్రదేయా
విశేషకాలే స్మరణేచ తజ్ఞైః
దంతోయముక్తః కిల కోలచర్చ. 63

తా. దీర్ఘమై - ఎఱ్ఱనై - వంకరగా గీతపడునట్లు - స్తనాగ్రములపై దంతక్షతమొనర్చినచో నది కోలచర్చ - అనబడును.

-: కేశాకర్షణప్రయోగము :-

శ్లో. ద్వాభ్యాం కరాభ్యాం శిరసి ప్రకామం
కృష్ట్వా కచాంశ్చుంబతి వల్లభశ్చేత్
తదేవదిష్టం సమహస్తసంజ్ఞం
స్యాదేకహస్తేన తరంగరంగః. 64

తా. రెండుచేతులతో తలవెండ్రుకలను పట్టుకొని ప్రియుడు చుంబించినచో సమహస్తమను పేరుగల కేశాకర్షణమగును.

ఒకచేతితో కేశాకర్షణ మొనర్చినచో తరంగరంగమనబడును.

-: కామావతంస లక్షణము :-

శ్లో. కర్ణప్రదేశేచ కచంనిపీడ్య
ప్రేమ్ణా పతిశ్చుంబతి వల్లభాస్యం
అన్యోన్య హస్తగ్రహ విస్తరేణ
కామావతంసం మునయోవదన్తి. 65

తా. చెవులకు సమీపముగ నుండు వెండ్రుకలనుపట్టుకొని ప్రియుడు ప్రేమతో ప్రియురాలి ముఖమును చుంబించి హస్తములను పరస్పరము గ్రహించుకొనినయెడల నది కామావతంసమను పేరుగల కేశాకర్షణమగును.

—: భుజంగవల్లీ లక్షణము :—

‡ శ్లో. సంవేష్ట్య సర్వాంగులిభిః కచౌఘం
యస్యాః పతిర్ధారయతి స్మరార్తాం
భుజంగవల్లీః పరికీర్తితేయం
రతోత్సవే కేశకళా విధిజ్ఞైః. 66

తా. రతికాలమందు ప్రియుడు మదనాతురయైయున్న ప్రియురాలి శిరోజములను అన్ని వ్రేళ్లతో గ్రహించి ముందుకులాగినచో అది భుజంగవల్లి అనుపేరుగల కేశాకర్షణమగును.

శ్లో. భవ్యా ఘనా రౌక్ష్య వివర్జి1తాశ్చ
శ్యామా విశాలా బహులాః కచాఃస్యుః
చుంబప్రదానావసరే2 ప్రకర్ష్యా
రాగోదయార్థం తరుణీజనానాం. 67

తా. స్త్రీల శిరోజములు గుబురుగా మృదువుగా మిక్కిలి నల్లగా అతిదీర్ఘములుగా సుందరముగా ఉంగరములుతిరిగినట్లు ప్రకాశించుచుండినయెడల ప్రియులు ప్రియురాండ్రను చుంబించుసమయమందు కేశాకర్షణమొనర్చినచో అనురాగవర్ధకమగును.

శ్లో. ఇత్యాదయో బాహ్యరత ప్రకారాః
పూర్వం రతజ్ఞైః పరికల్పనీయాః
అన్యేపి యేసంతి బహుప్రభేదా
నోక్తామయా విస్తరభీతి తస్తే. 68

తా. పైనచెప్పబడిన విధులన్నియు బాహ్యరతములు. వీనిని రతికళావేత్తలు సంభోగమునకు ముందుగ నొనర్పవలయును. వీనిలో చాలభేదములు గలవు. వానిని గ్రంథవిస్తరభీతిచే చెప్పలేదు.

ఇతి శ్రీకవిశేఖర జ్యోతిరీశ్వరకృతే
పంచసాయకే చతుర్థఃసాయకః.

‡ 61_62_63_64_65_68 శ్లోకములు అచ్చు ప్రతిలో ప్రక్షిప్తములు (ఉదహరింపబడలేదు) పా. 1. తాచ 2. ప్రయోజ్య.

శ్రీరస్తు.

# పంచసాయకము.

—♦ పంచమ సాయకము ♦—

శ్లో. మనోభవాగార [1]ముఖేతు నాడ్య
స్తిస్రో భవంతి ప్రమదాజనానాం
సమీరణా చంద్రమసీచ గౌరీ
విశేష మాసా ముపవర్ణయామి. 1

తా. స్త్రీలకు కామగృహముయొక్క- మధ్యభాగమందు సమీరణా - చాంద్రమసీ - గౌరీ అనుపేరులుగల మూడునాడులుండును. వాని విశేషమును తెలుపుచున్నాను.

శ్లో. ప్రధానభూతా మదనాతపత్రే
సమీరణా నామ విశేషనాడీ
తస్యా ముఖే యత్పతితం నృవీర్యం
తన్నిష్ఫలంస్యాదితి చంద్రమౌలిః. 2

తా. కామాతపత్రమందలి సమీరణా అనేనాడీముఖమందు వీర్యపతనమైనచో నిష్ఫలమగును. అనగా స్త్రీకి గర్భధారణము కలుగదు. అని గ్రంధకర్త చెప్పుచున్నాడు.

శ్లో. యాచా ఽపరాచంద్రమసీచ నాడీ
కందర్పగేహే భవతిప్రధానా
సా సుందరీ యోషితమేవ సూతే
సాధ్యా భవేదల్ప రతోత్సవేన. 3

తా. రెండవదగు చంద్రమసీ అనునాడి మదనగృహమందు ప్రధానమైనది. దానియందు వీర్యపతనమైనచో తప్పక కన్యక జనించును. ఇది అల్పరతమువలన సాధ్యము.

---

[1] ముఖేఽవలానాం - అన్ని కొన్నిప్రతులలోని పాఠాంతరము. అవలానాం + అనుమాటకు అబలానాం అని భావము.

శ్లో. గౌరీతినాడీ యదుపస్థ[1]దేశే
పరిధానభూతా భవతి స్వభావాత్
పుత్రం ప్రసూతే బహుదాంగనా సా
కష్టోపభోగ్యా [2]సురతం ప్రదిష్టా. 4

తా. కామగృహమండలి గౌరీ అనునాడి స్వభావసిద్ధముగ నన్నింటికంటెను ప్రధానమైనది. దానియందు వీర్యపతనమైనచో స్త్రీలు పుత్రుని ప్రసవింతురు. ఈనాడి కఠినరతులవలన సాధ్యమగును.

—: ఉత్తానబంధ సముద్దేశము :—

శ్లో. ప్రసారితోరుద్వయ మధ్యయోగాత్
గాఢాపినారీ శ్లథతా ముపైతి
సంలగ్న జానుద్వయ బంధయుక్తా
శ్లథాపి సంకోచమలం [3]ప్రయాతి. 6

తా. తొడలు విస్తరింపజేసి తన్మధ్యభాగమున భగ లింగ సంయోగ మాచరించినయెడల సంకుచితభగమైనను విస్తరించును. తొడలు మోకాళ్లు పరస్పరము కలుపుకొని సంయోగముచేసినయెడల విస్తరింపబడియున్న భగమైనను సంకుచితమగును.

శ్లో. తస్యాయువత్యాః ప్రకృతించ సత్వం
దేశంచభావం మదనాతపత్రం
ఆలోక్యబన్ధాః పరికల్పనీయాః
సంభోగకాలే పురుషై [4]రసజ్ఞైః. 6

తా. రసజ్ఞుడైన పురుషుడు సంభోగకాలమునకు ముందుగా స్త్రీలయొక్క ప్రకృతి - సత్వము - దేశము - భావము - మదనగృహము - మదనాతపత్రము మొదలగువానిని విచారించి బంధములనుపయోగింపవలయును.

---

[1] గర్తే [2] సురతే

[3] యువత్యాః (అని కొన్ని ప్రతుల పాఠాంతరమున్నదికాని అది అసమంజసమని కొందరిమతము. [4] రతిజ్ఞైః

—: ఉత్తానకరణవిధి :—

శ్లో. ఉత్తాన సుప్త ప్రమదోరుమధ్యే
స్థితః పతిః కామయతే ప్రకామం
తయోర్ద్వయోః ప్రీతికర ప్రదిష్టో
బంధో నరాణా మతి1దుర్లభోయం. 7

తా. వెల్లకిల పరుండియున్న స్త్రీయొక్క తొడలమధ్యనుండి భర్త రతియొనర్చినయెడల మానినికి మనోరంజనమును కలుగజేయును గాన నిట్టికరణములే (బంధములు) భార్యాభర్తలకు సుఖము కలుగ జేయును. ప్రీతికరమగును.

—: సమపాదబంధము :—

శ్లో. ఉత్తానసుప్తా యువతి స్వపాదౌ
స్కంధే సమారోప్య 2రమేన్నరస్య
బంధోయముక్తః సమపాద సంజ్ఞః
ప్రయోజనీయః 3కరిణీరతేషు. 8

తా. స్త్రీ వెల్లకిలపరుండి తనపాదములను రెండింటిని పురుషుని భుజములపై నుంచగా పురుషుడు రమించినయెడల నది సమపాద బంధమగును. ఇది హస్తినీజాతి స్త్రీల కుపయుక్తము.

—: నాగరాఖ్యబంధము :—

శ్లో. ఏవం విధాయాః స్త్రియఏవ జంఘాం
కాంతస్స్వజంఘోపరి సన్నివేశ్య
ఉద్వృత్య భూయః కటిమారమన్త్యాః
స్యాదేషబంధః కిల నాగరాఖ్యః. 9

తా. పైనచెప్పిన విధముగ వెల్లకిల పరుండియున్న ప్రియురాలి తొడలను తనతొడలలో వైచుకొని కటిప్రదేశమును త్రిప్పుచు రమించినయెడల నది నాగరమను పేరుగల బంధమగును.

---

1 నాగరోయం

2 రమేతరమ్యాం + రమేతరామాం 3 తరుణీరతేషు

—: వ్యోమపదబంధము :—

శ్లో. ధృత్వా1స్వజానుం గగనే స్వపాదౌ
శయ్యాతలే స్త్రీ ప్రథమం ప్రసుప్తా
కుచౌ పతిః2పాణియుగేన ధృత్వా
రమేత్తదా వ్యోమపదాభిధానం. 10

తా. స్త్రీ శయ్యపై పరుండి పాదములను పైకెత్తి పట్టుకొని యుండ పురుషుడామె తొడలమధ్య కూర్చుండి రెండుచేతులతో ప్రియురాలి కుచములను గ్రహించి రతిచేసినచో నది వ్యోమపదబంధ మగును.

—: త్రైవిక్రమబంధము :—

శ్లో. ఏకంయువత్యాశ్చరణం పృథివ్యా
మూర్ధ్వం తథాన్యం పరికల్ప్య కాంతః
పథ్యాంస్థితో హస్తయుగంచ భూమౌ
త్రైవిక్రమస్స్యా దితి బంధరాజః. 11

తా. యువతి తనయొక్క పాదములలో నొకదానిని భూమిపై నుంచి రెండవపాదమును పైకెత్తియుండ పురుషుడు తనపాదముల బలమువలన రెండుచేతులు క్రిందనుంచి రమించినచో నది త్రైవిక్రమ బంధమగును. ఇది బంధములలో గొప్పది.

—: చాటుక ఫేలుక బంధము :—

శ్లో. నితంబబింబం కిల నాయకేన
నార్యాస్త్రికం హస్తయుగేన ధృత్వా
గుల్ఫౌ నిధాయ స్థితఏవ తస్యా
బంధోప్యసౌ చాటుక3ఫేలుక స్స్యాత్. 12

తా. నాయకుడు ప్రియురాలి కటిప్రదేశముయొక్క పైభాగ మును నితంబమును రెండుచేతులతో పట్టుకొని మోకాళ్ళపై నుంచి రమించినచో అది చాటుకఫేలుక బంధమగును.

---

1 ప్రజానుం 2 పాణితలేన

3 ఫేరుకస్యాత్ + కేలికస్స్యాత్.

—: అవదారితబంధము :—

శ్లో. కాంతస్య వక్షస్స్థలగౌ చ పాదా
వాలింగ్య గాఢం ప్రమదా కరాభ్యాం
కించిన్నతోరుద్వయ యోగకశ్చ
జ్ఞేయో బుధై రిత్యవదారితోయం. 13

తా॥ నాయకుని వక్షమునందు తనపాదముల రెండింటినుంచి రెండుబాహువులతో గాఢాలింగనమొనర్చి తొడలు కొంచెమువంచి యున్న నాయికను ప్రియుడు రమించినయెడల నది అవిదారితబంధ మగును.

పార్శ్వబంధములవివరము.

—: ఉపవీతికాఖ్యబంధము :—

శ్లో. ఏకం యువత్యా హృదయే స్వపాదం
తథార్పితం తల్పగతం తదన్యం
ప్రౌఢాంగనా వల్లభ ఏష బంధః
ఖ్యాతః పృథివ్యా ముపవీతికాఖ్యః. 14

తా. ఒకపాదము ప్రియురాలి వక్షస్థలముపై నుంచి రెండవ పాదము శయ్యపై నుంచి రమించినయెడల ఉపవీతిక అనుపేరుగల బంధ మగును. ఇది ప్రౌఢాంగనలకు ప్రియమైనది.

—: సంపుటబంధము :—

శ్లో. 1ఊరోర్వః పతిర్మధ్యగతో యువత్యాః
పార్శ్వస్థితాయాః పరిరభ్య దేహం
యూనో స్త్రికా లోలనతో రసజ్ఞై
2రత్యాదృత స్సంపుట నామధేయః. 15

తా. ప్రక్కవాటుగా పండుకొనిన ప్రియురాలియొక్క తొడల మధ్యనుండి నాయకుడు స్త్రీదేహమును కౌగలించుకొనుచు కటిప్రదేశ ములు చలించునట్లు రమించిన-చో సంపుటబంధమగును. ఇది రసికు లకు ప్రియమైనది.

పా. 1 ఊర్ధ్వం, 2 రుజాహృతః,

—: నాగబంధము :—

శ్లో. పార్శ్వస్థితాయాః మృగశావకాక్ష్యాః
1పృష్ఠావలంబీ రమణః ప్రసుప్తః
లింగ స్మరాగార నివేశయోగా
దిహోపదిష్టః ఖలు నాగబంధః. 16

తా. నాయకుడు పక్కవాటుగ పరున్న ప్రియురాలి వీపు నానుకొని పరుండి భగమందు లింగమునుంచినయెడల నది నాగబంధ మగును.

ఉపవిష్టబంధప్రియోగములు.

—: పద్మాసనబంధము :—

శ్లో. పద్మాసనం సంపరికల్ప్య భర్తా
2క్రీడోపవిష్టాం యువతిం రమేచ్ఛ
అన్యోన్యకంఠార్పిత బాహుయోగాత్
పద్మాసనాఖ్యం ప్రవదంతిసంతః. 17

తా. నాయకుడు పద్మాసనాసీనుడై ప్రియురాలి నొడిలో గూర్చుండబెట్టుకొని పరస్పరము బాహువులచే కంఠాలింగ మొనర్చు కొనుచు క్రీడించినయెడల నది పద్మాసనబంధమగును.

—: కీర్తిబంధము :—

శ్లో. కాంతో నితంబస్థిత ఏవ నార్యాః
శ్రోణీం కరాభ్యాం యది యాతి ధృత్వా
ఆస్ఫాలయేద్వాపి కటిప్రబంధాత్
ప్రోక్తో మునీంద్రైరితి కీర్తిబంధః. 18

తా. పురుషుడు స్త్రీయొక్క నితంబముకడనుండి తన రెండు చేతులతో ఆమె కటిప్రదేశముయొక్క అగ్రభాగమును (శ్రోణి) గాని నాభినుండి క్రిందకుగాని చేతులతో పట్టుకొని నిమురుచు రాచుచు క్రీడించినయెడల నది కీర్తిబంధమగును.

---

1 తత్పృష్ఠవర్తీ
పా. 2 క్రోడోపవిష్టాం

## అధోముఖబంధప్రయోగములు.

-: హరిణబంధము :-

శ్లో. అధోముఖస్థాం రమయేచ్చ నారీం
తత్పృష్ఠవర్తీ పశుతుల్యరూపః
భర్తా పరిక్రీడతి భావహీనో
నిర్దిశ్యతే హారిణబంధ ఏషః. 19

తా. అధోముఖియై ఆడలేడివలె ముందుకువంగియున్న నాయికను నాయకుడు పశువువలె వెనుకనుండి భావహీనుడై క్రీడించిన యెడల హారిణ బంధమగును.

శ్లో. దంతావల చ్ఛాగ తురంగమాణాం
క్రీడాప్రకారైశ్చ భవంతి బంధాః
ఇత్థం రసజ్ఞై రనుపాలనీయా
నోదాహృతా 1విస్తరభీతిత స్తే. 20

తా. ఏనుగు - గుఱ్ఱము - మేక - మొదలగు పశువులవలె రమింప తగిన బంధములు పెక్కులున్నవి. కాని ఎవరు ఎంతవరకు రసజ్ఞులో తదనుగుణ్యముగ ఆనందముననుభవింతురు. అవి యన్నియు గ్రంథవిస్తరభీతిచే చెప్పబడియుండలేదు.

ఊర్ధ్వబంధప్రయోగవివరము—వ్యాత్తకరబంధము.

శ్లో. అన్యోన్యదోః పంజర 2మధ్యజాతః
స్తంభో యదా బాహుయుగేన 3లగ్నః
నిష్పీడ్య నారీ పతిమూర్ధ్వసంస్థం
రమేత్తదా వ్యాత్తకరం వదంతి. 21

తా. స్త్రీపురుషులిర్వురు శయ్యపైపరుండి ఒకరి నొకరు బాహువులచే పంజరమున బంధింపబడినట్లు గాఢముగ కౌగలించుకొని యుండగా నాయిక తనపైనున్న ప్రియునికి శ్రమకలుగునట్లు అతనితో రమించినచో నది వ్యాత్తకరమను బంధమగును.

1 విస్తరభారత స్తే 2 జాతా 3 భగ్నా

-: త్రిపాదబంధము :-

శ్లో. ఏకో యువత్యా యది కాంత[1]హస్తే
జానుస్థితః స్యాదపరః పృథివ్యాం
కాంతం కరాభ్యా ముపగూహ్యా యస్మాత్
జ్ఞేయం రసజ్ఞైః కరణం త్రిపాదం. 22

తా. స్త్రీ తనమోకాలిని ప్రియుని హస్తముపైనుంచి రెండవ పాదమును భూమిపైనుంచి రెండుచేతులతో నాయకుని కౌగలించుకొనిన రసికులైనవారు త్రిపాదబంధమని పల్కుచున్నారు.

విపరీతబంధవివరము.

-: పురుషాయితము :-

శ్లో. అధోముఖీ కాంతహృది ప్రసుప్తా
దోర్భ్యాం సమాలింగ్య యది ప్రయాతి
గాఢాంగనా వల్లభ ఏష తజ్ఞైః
బంధః ప్రదిష్టో విపరీతరూపః. 23

తా. నాయిక పురుషుని వక్షస్స్థలముపై అధోముఖియై పరుండి బాహువులచే గాఢాలింగనమొనర్చుచు రమించినయెడల నది విపరీత బంధమనబడును. ప్రౌఢాంగనల కిది సంతోషకరము.

శ్లో. ధూర్త త్వమేవం విజితోస్యకస్మా
ద్యుద్ధే మయా పంచశరస్య [2]నారీ
ఇత్యాదికం భూరివిధం రటంతీ
ప్రియస్సుఖం విందతి కేలిరంగే. 24

తా. పైనచెప్పబడినట్లు నాయకుని వక్షముపై పరుండి ప్రియుని జూచి నవ్వుచు ధూర్తుడా! ఇన్నిదినములనుండి నీవు మన్మథయుద్ధములో మమ్మోడించుచుంటివి. ఇప్పుడు నిన్ను ఓడించి కసిదీర్చుకొంటినని పల్కుచు కేళీరంగమందు సుఖమునను భవింతురు.

1 హస్తే పా. 2 నార్యో,

—: విపరీతరతికి అయోగ్యస్త్రీలు :—

శ్లో. 1అల్పాప్రసూతా ఋతుయోగయుక్తా
గర్భాలసా స్థూలతను ర్కృశాంగీ
క్షీణా నవోఢా జ్వరితా చ నారీ
వర్జ్యా రతిజ్ఞైర్విపరీతబంధే. 25

తా. అప్పుడే ప్రసవించినది (నవప్రసూత) ఋతుమతియైనది-గర్భవతి - లావుగల శరీరముకలది - వంగినదేహముకలది - నవోఢ - జ్వరపడినస్త్రీ - వీరు విపరీతబంధములకు అనర్హులు.

—: తాడనప్రయోగము :—

శ్లో. వామస్వభావా న్మదనస్య రాగో
హ స్తప్రహారాత్స ముపైతి వృద్ధిం
తస్మాద్వ్యథాస్థానమసౌ విధేయో
వామాంగనాయాః 2సురతావసానే. 26

తా. మన్మథానురాగము ఎప్పుడునూ ప్రతికూల స్వభావముగానుండునుగాన స్త్రీలయందు రాగవృద్ధి చపేటములవలననే కలుగును. కనుక స్త్రీలకు సురతాంతమందు అనురాగవృద్ధికై తాడనములను చేయవలయును.

శ్లో. యద్వ్యంగనా కాంతహృది ప్రహారం
ముష్ట్యా భజంతీ సురతోపచారైః
సంతాడితం నామవదంతి తజ్ఞా
వి స్తీర్ణ హ స్తేన తదా పతాకం. 27

తా. స్త్రీ పురుషుని వక్షస్థలముపై పరుండి ముష్టిఘాత మొనర్చినయెడల సంతాడితమను హ స్తప్రహారమగును. అదేవిధముగా స్త్రీపరుండి అరచేతితో నాయకుని కొట్టినయెడల పతాకమనబడును.

శ్లో. సాంగుష్ఠమధ్యాంగులసంప్రహారాత్
సంజాయతే కుండలనామధేయః

1 అల్పప్రియుక్తా + నైవప్రసూతా
పా. 2 సురతోపదేశే

యః కేవలాంగుష్ఠభవోభిఘాతః
ప్రోక్తః కవీంద్రైస్తు బిందుమాలః. 28

తా. అంగుష్ఠముతో మధ్యవ్రేలినికలిపి ప్రహరించుటవలన కుండల అనుపేరుగల తాడనమగుచున్నది. అంగుష్ఠముతో ప్రహరించిన యెడల బిందుమాల అను పేరుగల తాడనమగుచున్నది.

—: సీత్కృతసముద్దేశ్యము :—

శ్లో. ద్రవతి యది న నారీ ప్రౌఢరాగార్థియుక్తా
మృదునిధువనయోగే దంతసదా 1సలీలం
పివతి దశనవాసః కించిదున్ముచ్య భూయః
కథితమిహ రసజ్ఞైః స్వీత్కృతం రాగకారీ. 29

తా. అధికానురాగము అతిమోహముకల స్త్రీ - కోమలమైన సురతమువలన ద్రవింపనిచో విలాసముగ దంతసంధియందు అధరమునుజేర్చి అధరపానముజేయుచు మధ్యమధ్య సీత్కార చుంబనములచేసినచో రాగవర్ధకమగును.

—: స్తనితనిరూపణము :—

శ్లో. పిక శిఖి కలహంస 2ప్రాయ పక్షివ్రజానాం
ధ్వనితమనుకరోతీ త్యంగనా 3మన్మథార్తా
ముఖదశనవివర్తా తత్కవీంద్రా వదంతి
స్తనితమితి 4సమానం చిత్రసంభోగకాలే. 30

తా. చిత్రరతియందు స్త్రీ కామార్తయై కోకిల, నెమలి, కలహంస మొదలగు పక్షులధ్వనుల ననుకరించుచు ముఖదంతాదులవలన చేయు ధ్వనిని నీ గ్రంథకర్త స్తనితమనిచెప్పియుండెను.

శ్లో. ఇత్యాదియోగైః పృథుకామభావం
సంపాద్య నారీ పురుషోఽచిరేణ
జాతానురాగా రహసి ప్రకామం
సౌఖ్యం సమాస్వాదయతో 5మహీయః. 31

1 సమీరం 2 క్రౌంచపక్షివ్రజానాం 3 యత్రనార్తి 4 సమాసాత్ 5 విచిత్రం

తా. పైనచెప్పబడిన ప్రయోగములవలన దంపతులు గొప్ప కామభావమును పొంది చిరకాలము సంపూర్ణానురాగము కలవారై యథార్థసుఖమును పొందుచున్నారు.

ఇదే నిజమైన సుఖముగాని పశుసంబంధమైన అత్యాచారము వలన సుఖములేదు.

శ్లో. ఏతే ప్రయోగా న చ సర్వదైవ
సర్వత్ర యోజ్యాః సురతే రతిజ్ఞైః
కాలే చ దేశే చ వరాంగనాయాః
యుక్తీకృతాః సుందరతాం ప్రయాంతి. 32

తా. ఈపైనచెప్పబడిన ప్రయోగములు రసజ్ఞులు ఎల్లప్పుడూ అందరియందునూ ప్రయోగింపజనదు. స్త్రీలయొక్క కాలము, దేశము, తత్వములనెరింగి ప్రయోగింపవలయును.

—: అష్టవిధనాయికలు :—

- స్వాధీనపత్రిక -

శ్లో. యస్యాః పతి[1]ర్మిలతి కేలికథానురక్తః
పార్శ్వం న ముంచతి మనోభవవేగయుక్తః
స్వాంతస్సుందరీ సకలసౌఖ్యకలానిధానా
స్వాధీనపూర్వపతికేతి వదంతి తజ్ఞాః. 33

తా. ఏస్త్రీకి మనోవాంఛితములను దీర్చగలవాడై ఎల్లప్పుడు ఎడబాయక మదనాతురుడైన భర్తలభించునో ఆమె సకలసౌఖ్యములకు స్థానమై స్వాధీనపతిక అనిపిలువబడును.

—: ఉత్కంఠిత :—

శ్లో. పుష్పాంగరాగ రుచిరా తరుణీ ప్రియస్య
తిష్ఠత్యనాగమనహేతు విచారలోలా
ఏషాఽబలా న హి చిరం పరిదేవనీయా
సోత్కంఠితేతి కథితా కవిభిః పురాణైః 34

---

1 ర్లిఖతి

తా. అనేకవిధములైన సుగంధద్రవ్యములగు గంధాదులను బూసుకొని పూవులుముడుచి శృంగారించుకొని ప్రియాగమనమును గూర్చి నిరీక్షించుచు ప్రియుడు రాకున్న చంచలచిత్తయై యుండు యువతి ఉత్కంఠితయనబడును.

—: వాసకసజ్జిత :—

శ్లో. స్రక్చందనాంబరవిభూషణభూషితాంగీ
యా వల్లభాగమన మార్గ విరూఢదృష్టిః
తల్పంగతా రుచిరవాసగృహేఽవశేతే
సా కీర్తితా జగతి వాసకసజ్జితేతి. 35

తా. పుష్పమాలికలు - మంచిగంధము - నగలు - విలువగల వస్త్రములు - మొదలగువాని సలంకరించుకొని పతిరాకకెదురు చూచుచు భర్తరాగానే సుందరమైన కేళికాగృహముజేరి తల్పముపై క్రీడించునో యామె వాసకసజ్జిత యనంబడును.

—: కలహాంతరిత :—

శ్లో. క్రోధాత్ప్రియాతి చరణే పతితేఽపి కాంతః
ప్రాయః ప్రచండవచనాచ్చరణైర్నిరస్తః
పశ్చాత్తదీయ విరహ క్షురదానతాంగీ
సా కీర్తితేహ కలహాంతరితా కవీంద్రైః. 36

తా. పాదములపై బడిన నాయకుని కోపముతో కఠినవాక్యములచే నొప్పించి యాతడు వెడలిపోయిన యనంతరము విరహవేదనచే వ్యాకులపడుచు తల వంచుకొనియుండు నాయిక కలహాంతరిత.

—: విప్రలబ్ధ :—

శ్లో. సంకేతకం ప్రియతమః స్వయమేవ దత్వా
నైవాగతస్సముచితే సమయే చ యస్యాః
హృష్టా వచోమృతరసైః సకలాంగయష్టిః
సా వర్ణితా కవివరైరిహ విప్రలబ్ధా. 37

తా. నియమితకాలమునకు వత్తునని వాగ్దానమొనర్చిన నాయకునిమాటప్రకారము సంతోషముతో శృంగారించుకొని యెదురు

చూచుచు నతడు సకాలమునకు రాకపోవుటచే చింతపడునాయిక విప్రలబ్ధయనబడును.

—: ఖండిత :—

శ్లో. ప్రాతర్వినిద్ర వదనస్మరభారచౌరో
నిద్రాలసోఽలసగతిర్నఖవిక్షతాంగః
యస్యాః ప్రయాత్యభిముఖం మువాశో యువత్యాః
సా ఖండితేతి కథితా కవిభిః పురాణైః. 39

తా. పరకీయమగు నాయికతో తెల్లవారువరకు క్రీడించివచ్చిన పతియొక్క నైఖరి ముఖమందలి నఖక్షతములు మొదలగు లక్షణములను జూచి మాటిమాటికి చిరాకుపడెడియువతి ఖండితయనబడును.

—: అభిసారిక :—

శ్లో. ఆరంభభగ్నచరితా వికలా చ నారీ
యా నిర్మితా హి మదనేన మదేన యాతి
గుప్తాభిసారరసికా పరవేశ్మగంతుం
సా కీర్తితా కవివరై రభిసారికేతి. 39

తా. యౌవనారంభ కాలమునుండియు ఖండితచరిత్రయై తదనంతరమందు మదనోన్మత్తయై గుప్తాభిసారరసమును (రహస్యక్రీడానందము) అనుభవించుటకై పరగృహములకు వచ్చుచు పోవుచుండు యువతి అభిసారికయనంబడును.

—: ప్రోషితభర్తృక :—

శ్లో. దేశాంతరం ప్రతివిశేత్ రమణశ్చ యస్యా
దత్వా వధిం చిరతరం గురుకార్య యోగాత్
దుర్వారదుఃఖదహనైః పరివేదితాంగీ
సా ప్రోషితా ప్రియతమా కథితా మునీంద్రైః. 40

తా. భర్త దూరదేశమునందు కార్యాంతరమగ్నుడై నిలిచియుండ నతని రాకకెదురుచూచుచు కాలవ్యవధి దాటిపోవుటచే అనేకవిధములుగ దుఃఖించుచు సంతాపతప్తయై ఉద్విగ్నయై విరహవ్యాకులముగల స్త్రీ ప్రోషితభర్తృకఅనబడును.

—: గ్రంథోపసంహారము :—

శ్లో. యావచ్చందకలాకిరీటహృదయే శైలాధిరాజాత్మజా
యావద్వక్షసి మాధవస్యకమలా సానందమాదీవ్యతి
యావత్కామకలా వివర్తచటులం క్షోణీతలం రాజతే
తావచ్ఛ్రీ కవిశేఖరస్య కృతినః కావ్య ముదే దీవ్యతాం. 41

తా. ఎంతవరకు గౌరీశంకరు లేకదేహులై యుందురో! ఎంత వరకు వైకుంఠవాసుని హృదయమందు లక్ష్మి సానందమగ్నయై నివసించునో! ఎంతవరకు కామకళయను సుడిగుండములో తిరుగుచు భూమి ప్రకాశించుచుండునో! అంతవరకు కవిశేఖరుని కావ్యమునందలి మధుర కోమల శబ్దములు కామకళాకుశలులైన వ్యక్తులయొక్క హృదయ కమలములను వికసింపజేయుగాక.

శ్లో. యావల్లేఖాం వహతి శిరసా శంకరశ్శీతరశ్మే
ర్యావద్వేదా వదనకమలే బ్రాహ్మణః స్సంతిసాంగాః
యావద్గంగా వహతి భువనే యావదాకాశభాను
స్తావత్కీర్తిర్వసతు విమలా సాత్రిలోకీంచపాయాత్. 42

శ్లో. యావల్లేఖా వహతి శిరసా శంకరశ్శీతరశ్మే
యావద్భాస్వన్ గగనఫలకే ద్యోతయన్ విశ్వమాయాః
భ్రామం భ్రామం చరతి ధరిణీ యావదా స్తేసశైలా
తావద్గోపాలజ గణపతేః ప్రీతయే కావ్యమస్తు. (పాఠాంతరం)

తా. ఎంతవరకు శంకరుడు చంద్రునిశిరస్సునధరించియుండునో! ఎంతవరకు బ్రహ్మముఖకమలమందు వేదములు అంగయుక్తములై ప్రకాశించుచుండునో! ఎంతవరకు గంగ భూమిపై ప్రవహించుచుండునో! ఎంతవరకు ఆకాశమున సూర్యచంద్రాదులు ప్రకాశించు చుందురో! అంతవరకూ యీ కవిశేఖరునికీర్తి ప్రకాశించుగాక.

ఇతి శ్రీ కవిశేఖర శ్రీ జ్యోతిరీశ్వరాచార్య విరచితే
పంచసాయకే పంచమః సాయకః స్సమాప్తః.

పంచసాయకము – సంపూర్ణము.

# భూ మి క .

మహాకవియైన జయదేవునిగూర్చి విననివారు భారతదేశమం దుండరు. ఆసేతు హిమాచలపర్యంత మీపరమభాగవతుని పేరు ప్రసిద్ధికెక్కియున్నది. ఇతఁడు పరమభాగవతుఁడగుటయేగాక కవియు గాయకుఁడగుటచే పండితులకేగాక గాయకులకు నితడు పూజ్యుఁడై యున్నాడు. ఇతని కవిత్వ మెంత రసవంతమో గేయకల్పనములు గూడ నంత మాధుర్యరసపూరితములై కర్ణపర్వము నాపాదించు చున్నవి. జయదేవుడను పేరుగల కవు లనేకరిద్దరున్నను గీతగోవింద మహాకావ్యకర్తయైన జయదేవుఁడే యీ రతిమంజరిని రచించెననుట నిర్వివాదాంశము. ఇందులకు గీతగోవిందములో వర్ణించిన శృంగార రసమే తార్కాణము. ఈ మహాకవియొక్క నివాసస్థానము తిందు బిల్వము. జగన్నాథప్రాంతమందలి బిందుబిల్వమను గ్రామమున జన్మించెనని మరికొందరు విమర్శించియున్నారు. తల్లి రామాంబ, తండ్రి భోజదేవుఁడు, భార్య పద్మావతి. ఈ మహాకవి వంగదేశమును పాలించిన మహారాజుల యాస్థానకవిగనున్నట్లు చరిత్రలవలన తెలియు చున్నది. గీతగోవిందము, రతిమంజరి, చంద్రాలోకము, కారకవాదము, తత్త్వచింతామణి యను గ్రంథముల నితఁడురచించెను.

ఈ రతిమంజరి కామశాస్త్రవిషయ పరిబోధకము. స్థాలీపులా కన్యాయముగ నాయికానాయక లక్షణములు మొదలుకొని కరణ ప్రయోగములవరకు నరువది శ్లోకములతో సంగ్రహించి వ్రాసి యున్నాఁడు. చుంబనతాడనాది ప్రయోగములు సైతము మధ్య మధ్య పేర్కొనబడినవి. పొత్త మెంత చిన్నదైనను విమర్శకులచేతను వ్యాఖ్యాతలచేతను తదితర కామశాస్త్రవిషయక గ్రంథములతోఁ బాటు రతిమంజరినికూడ పేర్కొనబడి యుండుటచేదీని ప్రాముఖ్యతను గూర్చి వేర నుడువ నక్కరలేదు.

మాకు దొరికిన చెన్నపట్టణపు పాతప్రతి శిథిలమైన పొత్తము ననుసరించి తాత్పర్యము వ్రాయించి ముద్రింపించుటచే లోపములు కొన్ని మిగిలియుండును. ద్వితీయముద్రణమున దిద్దుకొనగలమని విన్నవించుచు లేఖక ప్రమాదజనిత దోషములను మన్నింప పండిత మండలిం బ్రార్థింపుచున్నాము.

శ్రీరస్తు

# రతిమంజరి



శ్లో. నత్వా సదాశివం దేవం నాగరాణాం మనోహరం
రచితా జయదేవేన సుబోధా రతిమంజరీ.

తా. నాగరకులకు మనోహరుడును దేవాదిదేవుడగు సదాశివు నకు నమస్కారపూర్వకముగ రసికులకు సుబోధమగునట్లు మహాకవి యైన జయదేవునిచే రతిమంజరియను శృంగారకావ్యము రచింపబడెను.

శ్లో. రతిశాస్త్రం కామశాస్త్రం తస్య సారం సమాహృతం
సుప్రబంధం సుసంక్షిప్తం జయదేవేన భణ్యతే. 2

తా. రతిశాస్త్రమనగా రతికళాప్రబోధకమగు కామశాస్త్ర సారము సంగ్రహింపబడి సంక్షిప్తముగా జయదేవకవిచే చెప్పబడు చున్నది.

శ్లో. పద్మినీ చిత్రిణీచైవ శంఖినీ హస్తినీ తథా
శశో మృగో వృషో ఽశ్వశ్చ స్త్రీపుంసోర్జాతిలక్షణమ్. 3

తా. పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని, అని స్త్రీలలో నాల్గుజాతులు. శశ, మృగ, వృష, అశ్వ, అని పురుషులలో నాల్గు జాతులుకలవు.

శ్లో. భవతి కమలనేత్రా నాసికా క్షుద్రరంధ్రా
అవిరళకుచయుగ్మా చారుకేశీ కృశాంగీ
మృదువచనసుశీలా గీతవాద్యానురక్తా
సకలతనుసువేషా పద్మినీ పద్మగంధా. 4

తా. తామరరేకులవంటి నేత్రములు, చిన్నవగు నాసికారంధ్ర ములు, అతివిస్తారముకాని బటువులైన కుచములు, సుందర కేశ పాశము, సన్నని శరీరము, మృదువాక్కులు, మంచి స్వభావము, గీతవాద్యములందనురక్తి, శృంగారింపబడిన అందమైన శరీరము, పద్మగంధమువంటి శరీరవాసనగల స్త్రీ పద్మినియని తెలిసికొనవల యును.

శ్లో. భవతి రతిరసజ్ఞా నాతిఖర్వాన దీర్ఘా
తిలకుసుమసునాసా స్నిగ్ధ నీలోత్పలాక్షీ
ఘన కఠిన కుచాఢ్యా సుందరీబద్ధశీలా
సకలగుణసమేతా చిత్రిణీ చిత్రవక్త్రా. 5

తా. రతికళలయందు రసికత్వమును, అతిదీర్ఘము మిక్కిలి కురుచగాని శరీరము, తిలపుష్పమువంటి నాసిక, నల్లకలువ రేకులవంటి నేత్రములు, (అందమైన) ఘనమై కఠినమైన కుచయుగము, సౌందర్యము సుశీలముకలిగియుండుట, సకలగుణములతో కూడినది, చిత్రమైన ముఖముకలది చిత్రిణిజాతిస్త్రీయని తెలిసికొనునది.

శ్లో. దీర్ఘాతిదీర్ఘనయనా వరసుందరీయా
కామోపభోగ రసికాగుణశీలయుక్తా
రేఖాత్రయేణచ విభూషితకంఠదేశా
సంభోగకేళిరసికా కిలశంఖినీసా. 6

తా. అతి దీర్ఘములైన నేత్రములు గొప్ప సౌందర్యము (సంభోగకేళిలో రసికత్వము) కామోపభోగమందు నేర్పరితనము సుగుణసుశీలములు కలిగియుండుట, మూడు రేఖలుగల కంఠముతో గూడుకొనునది శంఖినీజాతిస్త్రీయని తెలిసికొనవలయును.

శ్లో. స్థూలాధరా స్థూల నితంబభాగా
స్థూలాంగులీ స్థూలకుచా సుశీలా
కామోత్సుకా గాఢరతిప్రియాయా
నితాంతభోక్త్రీ కరిణీమతాసా. 7

తా. అధరము, నితంబము, (పిరుదులు) వేళ్లు, కుచములు, స్థూలములై యుండుట, సుశీలము, కామోద్రేకము, గాఢరతులకు సంతసించుట, ఎక్కువగా భుజించుట కిష్టపడుట, ఈ గుణములుగల స్త్రీ హస్తినిగా నెఱుంగునది.

శ్లో. శశకే పద్మినీతుష్టా. చిత్రిణీరమతే మృగం
వృషభే శంఖినీతుష్టా హస్తినీరమతే హయం. 8

తా. శశజాతి పురుషునియందు పద్మినియు, మృగజాతి పురుషునియందు చిత్రిణియు, వృషజాతి నాయకునియందు శంఖినియు, అశ్వజాతి పురుషునియందు హస్తినియు ప్రేమకల్గి రమింతురు.

శ్లో. పద్మినీ పద్మగంధాచ మీనగంధాచ చిత్రిణీ
శంఖినీ క్షారగంధాచ మదగంధాచ హస్తినీ. 9

తా. తామరపూవుయొక్క పరిమళమువంటి దేహపరిమళము గలది పద్మినియు, చేపవాసనతోకూడిన శరీరముగలది చిత్రిణియనియు, కారపువాసనకలది శంఖినియనియు, ఏనుగుమదజలమువాసనతో కూడినది హస్తినియనియు తెలిసికొనవలయును.

శ్లో. బాలాచతరుణీ ప్రౌఢా వృద్ధా భవతి నాయికా
గుణయోగేన రంతవ్యా నారీ వశ్యా భవేత్తదా. 10

తా. బాల, తరుణి, ప్రౌఢ, వృద్ధ, అని వయస్సునుబట్టి స్త్రీలు నాలుగువిధములుగా నుందురు. ఆయాస్త్రీల గుణభేదములను గ్రహించి రమించినచో వశ్యురాండ్రు కాగలరు.

శ్లో. ఆషోడశాద్భవేద్బాలా తరుణీ త్రింశతామతా
పంచపంచాశతాప్రౌఢా భవేద్వృద్ధాతతఃపరం. 11

తా. పదునారువత్సరముల ప్రాయము వచ్చువరకు బాలయనియు, ముప్పదివత్సరములవరకు తరుణియనియు, ఏబదియయిదు వత్సరములవఱకు ప్రౌఢయనియు, తదనంతరము వృద్ధయనియు తెలిసికొనవలయును.

శ్లో. ఫలమూలాదిభిర్బాలా తరుణీరతియోగతః
ప్రేమదానాదిభిః ప్రౌఢా వృద్ధాచ దృఢతాడనాత్. 12

తా. ఫలమూలాదులనగా పండ్లు మొదలగు వాని నిచ్చి బాలను, సురతనైపుణ్యమునుజూపి తరుణిని, ప్రేమప్రసంగములద్వారా ప్రౌఢను, ధృఢతాడనమువలన వృద్ధను వశపరచుకొనవలయును.

శ్లో. బాలా తుప్రాణదాప్రోక్తా తరుణీ ప్రేమహారిణీ
ప్రౌఢా కరోతివృద్ధత్వం వృద్ధాచ మరణందిశేత్. 13

తా. బాల ప్రాణములనిచ్చును. తరుణి ప్రేమనుహరించు నదియగును. ప్రౌఢ ముదుసలితనమును కలుగజేయును. వృద్ధమరణము నిచ్చును.

శ్లో. అంగుష్ఠే చరణే చ గుల్ఫనిలయే జానుద్వయే వస్తికే
నాభౌవక్షసి జంఘయోర్నిగదితా కంఠే కపోలేధరే
నేత్రే కర్ణయుగే లలాటఫలకే మౌళౌ చ వామభ్రువా
మూర్ధ్వాధశ్చలనక్రమేణ కథితా చాంద్రీకళాపక్షయోః. 14

తా. చంద్రకళ శుక్లపాడ్యమిని పాదాంగుష్ఠమునుండి ప్రారంభమై క్రమముగా పాదములు, పిక్కలు, మోకాళ్లు, పొత్తికడుపు, నాభి, వక్షస్థలము, తొడలు, కంఠము, కపోలము, అధరము, నేత్రములు, చెవులు, లలాటము, శిరము, కనుబొమలయందు పూర్ణిమవరకు ఊర్ధ్వక్రమముగా వ్యాపించి కృష్ణపాడ్యమిమొదలుకొని దిగిపోవును.

శ్లో. సీమంతే నయనే ధరేచ గళకే కక్షస్తగే చూచుకే
నాభౌశ్రోణితటే మనోభవగృహే జంఘాతటే గండకే
గుల్ఫే పాదతలే తదంగుళితటేం గుష్ఠేచ తిష్ఠత్యసౌ
వృద్ధిక్షీణతయా సమంశశికళా పక్షద్వయోర్యోషితాం. 15

తా. చంద్రకళస్త్రీలకు పాపట, నేత్రము, అధరము, కంఠము, చంక, కుచాగ్రము, బొడ్డు, పిఱుదు, యోని, పిక్కలు, చెక్కిలి, శీలమండలము, పాదము, కాలివ్రేళ్లు, కాలిబొటనవ్రేలు, వీనియందు శుక్లపక్షమున వృద్ధిగను కృష్ణపక్షమున క్షీణముగను నుండును.

శ్లో. శుక్లపక్షే వసేద్వామే పాదాంగుళి కనిష్ఠకే
శుక్లప్రతిపదాదౌచ కృష్ణేచాధః ప్రలంబతే. 16

తా. చంద్రికళ శుక్లపక్షమున ఎడమకాలి చిటికెనవ్రేలియందుండును. కృష్ణపక్షమున, శుక్లపాడ్యమివరకూ క్రిందకు దిగిపోవును.

శ్లో. పుంసస్సవ్యే స్త్రీయోవామే శుక్లే కృష్ణేవిపర్యయః
ఏతానికామస్థానాని జ్ఞేయాని నాగరైస్సదా. 17

తా. శుక్లపక్షమున పురుషునకు కుడిపైపునను, స్త్రీకి యెడమ పైపునను, కృష్ణపక్షమున దీనికి విపర్యయముగను కామముద్రి క్తముగ నుండును.

శ్లో. బలయుక్తాయదానారీ విపరీత రతిర్భవేత్
సంచాల్యతు కళాస్థానం రంతవ్యా కామినీ తథా. 18

తా. స్త్రీ బలవంతురాలైనచో విపరీత రతి సంభవించును గనుక అట్టి కామిని కళాస్థానమును స్పృశించి చలింపజేసి రమింప తగినది.

శ్లో. నేత్రేకంఠేకపోలేచ హృదిపార్శ్వద్వయోపిచ
గ్రీవాయాం నాభిదేశేచ కామీచుంబతి కామినీం. 19

తా. కాముకుడు కామినియొక్క నేత్రమునందు, కంఠము నందు, కపోలములయందు, హృదయమందు, పార్శ్వద్వయములందు. మెడయందు, నాభిప్రదేశమందును చుంబించవలయును.

శ్లో. ముఖే జంఘే నితంబేచ జఘనే మదనాలయే
స్తనయుగ్మే సదాప్రీతః కామీ చుంబతి కామినీం. 20

తా. మరియును కామినియొక్క ముఖము, తొడలు, నితం బము, మొల, మదనగృహము, స్తనయుగములనుకూడ ప్రీతితో కాముకుడు చుంబించవలయును.

శ్లో. ప్రేమ్నాస్త్రియం సమాలింగ్య సీత్కారం ముఖ చుంబనం
కంఠాసక్తం పునఃకృత్వా గాఢాలింగన మాచరేత్. 21

తా. నాయకుడు కామినిని ప్రేమతో సమాలింగమునుచేసి సీత్కారమొనర్చి ముఖమును చుంబించి కంఠమును దగ్గరగా దీసికొని గాఢాలింగనమును చేయవలయును.

శ్లో. విధృత్యహస్తౌ జఘనోపవిష్టః
సీత్కృత్య వక్త్రే చ ముదా ప్రచుంబ్య
భగేచ లింగం స్తన మర్దనంచ
దత్వాపి కృత్వా పరిరమేచ్చకామీ. 22

తా. నాయకుడు కామినియొక్క జఘనముకడ నుపవిష్టుడై అనగా కూర్చుండి సీత్కారముచేయుచు చేతులతో కంఠమును గ్రహించి చుంబించుచు భగమందు లింగమునుంచి కుచములను మర్దించుచు రమింపవలయును.

శ్లో. కేశక్యగ్రే నఖంకృత్వా నఖాంస్త్రీ స్పంచచైవ వా
పృష్ఠేచ జఘనేయోనౌ దత్వాకామీరమేత్ స్త్రియం. 23

తా. కాముకుడు స్త్రీయొక్క వీపునగాని పిఱుదునందుగాని యోనియందుగాని మొగలిరేకు మొనవంటి నఖముచే మూడు లేక అయిదు నఖక్షతములనిచ్చి క్రీడింపవలెను.

శ్లో. నఖరోమాంచితం కృత్వా దందేనాధరపీడనం
గ్రీవామాకృష్యయత్నేన యోనౌలింగేన తాడనం. 24

తా. నఖక్షతములను పులకాంకురితమును కలుగునట్లుచేసి దంతములచే అధరమును పీడించుచు ప్రయత్నముతో కంఠమును గ్రహించి యోనియందు లింగముతో తాడనము చేయవలయును.

శ్లో. లింగప్రవేశనం కృత్వా ధృత్వాగాఢప్రయోగతః
పార్శ్వద్వయేన సంపీడ్య నిస్పృహం తాడయేద్భగం. 25

తా. లింగమును భగమున ప్రవేశపెట్టి గాఢముగా త్రోసి ఇరువైపుల పీడించుచు మైమరచి భగతాడనము చేయవలయును.

శ్లో. సమాలింగ్యస్త్రియం గాఢం స్తనయుగ్మే చ మర్దనం
యోనౌ నాభౌచ సమ్మర్ద్య నిష్ఠురం లింగతాడనం. 26

తా. స్త్రీని గాఢముగా కౌగలించుకొని కుచయుగమునను, భగమందును, నాభియందును మర్దించి పిదప తీవ్రముగా లింగముచే తాడనము చేయవలెను.

శ్లో. కేశం కరేణ సంగృహ్యా దృఢం సంతాడయేద్భగం
వదనే చుంబనం కృత్వా భగంహస్తేన మర్దయేత్. 27

తా. కొప్పును చేతితో గ్రహించి భగమును తాడనముచేయవలయును. మఱియు ముఖమును చుంబించి భగమును హస్తముచే మర్దనము చేయవలయును.

శ్లో. కుచంకరేణ సమ్మర్ద్య పీడయే దధరం దృఢం
రమణం పద్మబంధేన పద్మినీ రతిమాదిశేత్. 28

తా. చేతితోఁ గుచమర్దనమొనర్చుచు దృఢముగా నధరపీడన మొనర్చుచు, పద్మబంధ మొనర్చుట పద్మినీ రతియని చెప్పబడును.

శ్లో. సీత్కారం చుంబనం పీడా గళేహస్తే చ చుంబనం
క్షణేక్షణే స్తనేహస్తం చిత్రిణీ రతిమాదిశేత్. 29

తా. సీత్కారచుంబనములు, అధరపీడయు, కంఠము హస్తములయందు చుంబించుటయు, క్షణక్షణమునను కుచములపై హస్తములుంచి రమించుటయును చిత్రిణీరతియని చెప్పఁబడును.

శ్లో. స్త్రీపుంసయో స్తథాన్యోన్యం భగే లింగే చ చుంబనం
రమణంతుతథాగాఢం శంఖినీ రతిమాదిశేత్. 30

తా. స్త్రీపురుషు లన్యోన్యము లింగ భగ చుంబనంబులఁ జేయుటయు గాఢముగా రమించుటయు శంఖినీ రతియని చెప్పఁబడును.

శ్లో. కేశంకరేణ సంగృహ్యాసుదృఢం గజబంధనం
భగం కరేణ సంతాడ్య హస్తినీ రతిమాదిశేత్. 31

తా. కేశపాశమును హస్తముచేత గ్రహించి గజబంధముతో రమించుచు చేతితో భగమును తాడనముచేయుట హస్తినీరతియని చెప్పఁబడును.

శ్లో. కూర్మపృష్ఠం గజస్కంధం పద్మగంధం సుగంధియత్
అలోమకం సువిస్తీర్ణం పంచైతద్భగముత్తమం. 32

తా. తాబేలు వీపువలె నుండునదియు గజస్కంధము (ఏనుగు మూపురము) వలె నుండునదియు పద్మగంధము గలదియు రోమ రహితమైనదియు విశాలమైనదియు నీయైదు తెఱంగులుగనున్న భగము త్తమమైనది.

శ్లో. కతలం నిమ్నమత్యుచ్చం గోజిహ్వాసదృశంపరం
ఇత్యుక్తం కామశాస్త్రజ్ఞై ర్భగ దోష చతుష్టయం. 33

తా. ఇరుకుగానుండుట, లోతుగానుండుట, ఆవు నాలికవలె నుండుట మిక్కిలి యెత్తుగానుండుట, ఈ నాలుగు భగదోషములని కామశాస్త్రజ్ఞులచే చెప్పఁబడెను.

శ్లో. ముసలం వంశకంవీరం ద్వివిధం లింగ లక్షణం
స్థూలం ముసలమిత్యుక్తం దీర్ఘం వంశకవీరకం. 34

తా. ముసలము, వంశకవీరకమనియు లింగము రెండు విధములు. లావుగానుండునది ముసలము, పొడవుగానుండునది వంశకవీరమనియుజెప్పఁబడెను.

శ్లో. స్త్రీజితో గాయకశ్చైవ నారీ సత్య పరస్సుఖీ
షడంగుళ శరీరశ్చ సశ్శ్రీమాన్ శశకోమతః. 35

తా. స్త్రీజితుఁడును గాయకుఁడును స్త్రీయందు సత్యమందు నాసక్తిగలవాఁడును సుఖవంతుఁడును ఆరంగుళములు ప్రమాణము గల లింగముకలవాఁడు శశకజాతిపురుషుఁ డనఁబడును.

శ్లో. శ్రేష్ఠస్తుధార్మికశ్శ్రీమాన్ సత్యవాదీప్రియంవదః
అష్టాంగుళ శరీరశ్చ రూపయుక్తో మృగోమతః. 36

తా. శ్రేష్ఠుఁడును ధర్మబుద్ధి గలవాఁడును సత్యవాదియు ప్రియబాషియు ఎనిమిది అంగుళములు పొడవుగల లింగముగలవాఁడు మృగజాతి పురుషుఁడు.

శ్లో. ఉపకారపరోనిత్యం స్త్రీజితః శ్లేష్మణాస్సుఖీ
దశాంగుళ శరీరశ్చ మనస్వీ వృభభో మతః. 37

తా. ఎల్లప్పుడును పరోపకారమునం దాసక్తి కలవాడును స్త్రీజితుఁడును శ్లేష్మశరీరము గలవాఁడును సుఖవంతుఁడును పది యంగుళముల పొడవు లింగము గలవాఁడును మానవంతుఁడగువాఁడు వృషభజాతి పురుషుఁడు.

శ్లో. కాష్ఠతుల్యవపుర్ధృష్టో మిథ్యావాక్యశ్చనిర్భయః
ద్వాదశాంగుళ లింగశ్చ దరిద్రశ్చ హయోమతః. 38

తా. కొయ్యవలె మోటుదేలిన దేహముకలవాఁడును అసత్య వాదియు భయరహితుఁడును పదురెండంగుళములు లింగముకల వాఁడును, దరిద్రుడునగువాఁడు హయజాతి పురుషుఁడు.

శ్లో. నరమంతేయ దానార్యాః తృప్తావారమతేచయా
నానాబంధాన్ స్తథా వక్ష్యే రంతవ్యా కామిభిఃస్త్రియం. 39

తా. రతియందు తృప్తిలేని స్త్రీలను సంతృప్తి పరచుటకు నానాబంధములను దెల్పుచున్నాను. కాముకులు వానివలన స్త్రీలను రమింపవలయును.

శ్లో. పద్మాసనో నాగపాదో లతావేష్ట్యోర్థసంపుటః
కులిశస్సుందరశ్చైవ తథా కేసరపవచ. 40

శ్లో. హిల్లోలో నరసింహోపి విపరీత స్తథాపరః
క్షుద్గారో ధేనుకశ్చైవ ఉత్కంఠశ్చతతః పరం. 41

శ్లో. సింహాసనో రతిర్నాగో విద్యాధరస్తు షోడశః —

తా. పద్మాసనము, నాగపదము, లతావేష్ట్యము, అర్ధసంపుటము, కులిశము, సుందరము, కేసరము, హిల్లోలము, నరసింహాము, విపరీతము, క్షుద్గారము, ధేనుకము, ఉత్కంఠము, సింహాసనము, నాగము, విద్యాధరము అను పదునారు బంధములు.

- పద్మాసనబంధ లక్షణము -

— కక్షాభ్యాంచ సమాలింగ్యనారీం పద్మాసనోపరి. 42

శ్లో. రమేద్గాఢం సమాకృష్యబంధోయం పద్మసంజ్ఞకః—

తా. కక్షలతో (చంకలు) స్త్రీని కౌగలించుకొని పద్మాసనమున నామె నాకర్షించి గాఢముగా క్రీడించిన పద్మబంధమగును.

- నాగపదబంధ లక్షణము -

— పాదౌ స్కంధయుగే హస్తాక్షిపేల్లింగం భగేలఘు. 43

శ్లో. ప్రరమేత్కాముకో నారీం బంధోనాగపదోమతః—

తా. పాదములను హస్తములను రెండుభుజములయందుంచి భగమందు లింగమును సూక్ష్మముగానుంచి కాముకుఁడు స్త్రీతోఁ గ్రీడించినయెడల నది నాగపదబంధము.

- లతావేష్ట బంధ లక్షణము -

శ్లో. — బాహుభ్యాం పాదయుగ్మాభ్యాం వేష్టయిత్వారమేత్ స్త్రియం. 44
లఘులింగం తాడయోద్యోనౌ లతా వేష్టోయముచ్యతే—

తా. బాహువులచేతను పాదముల రెండింటిచేతను స్త్రీని పెనవైచి భగమున సూక్ష్మముగా లింగతాడనముజేయుచు రమించినయెడల నది లతావేష్టబంధమగును.

- అర్థసంపుట బంధ లక్షణము -

శ్లో. — స్త్రీపాదావంతరిక్షేతు కించిద్భూమౌచ జానునీ. 45
స్తనయోర్మర్దనంపీడా బంధోయమర్ధసంపుటః—

తా. స్త్రీ తన పాదములను పైకెత్తి మోకాళ్లను కొంచెము భూమిపైనుంచగా పురుషుఁడు స్తనమర్దనముజేయుచు రమించుట అర్థసంపుటబంధ మనఁబడును.

- కులిశ బంధ లక్షణము -

శ్లో. — స్త్రీపాదద్వయ మాస్ఫాల్య హఠాల్లింగస్య తాడనం. 46
యోని మాపీడయేత్కామీ బంధః కులిశసంజ్ఞకః—

తా. స్త్రీయొక్క పాదద్వయము నాస్ఫాలనముఁజేయుచు హఠాత్తుగా లింగతాడనముఁజేయుచు పీడించి రమించుట కులిశబంధమగును.

- సుందర బంధ లక్షణము -

శ్లో. — నారీపాదద్వయం స్వామీధార యేదూర్ధ్వదేశతః. 47
కుచౌధృత్వాపిబేద్వక్త్రం బంధోయం రతిసుందరః—

తా. స్త్రీయొక్క పాదములను రెండింటిని పైకెత్తియుంచి స్తనములను పట్టుకొని ముఖమును చుంబించుచు రమించుట సుందర బంధమగును.

- కేసర బంధ లక్షణము -

— స్త్రీయో జంఘేసమాపీడ్య దోర్భ్యాం గాత్రస్య మర్దనం. 48
శ్లో. పునఃప్రపీడ యేద్యోనిం బంధః కేసరసంజ్ఞకః—

తా. స్త్రీయొక్క పిక్కలను నొక్కి చేతులతో శరీరమును మర్దించి యోని పీడనమొనర్చుచు రమించినచో కేసరబంధ మగును.

- హిల్లోల బంధము -

— హృదికృత్వాస్త్రియః పాదౌకరాభ్యాంధారయేత్కరౌ. 49
శ్లో. యథేష్టంతాడయేద్యోనిం బంధోహిల్లోల సంజ్ఞకః—

తా. స్త్రీ పాదములను తన రొమ్మున నిడికొని చేతులతో నామె చేతులు పట్టుకొని యథేచ్ఛగా యోని తాడనముఁజేయుచు రమించినచో హిల్లోలబంధమగును.

- నరసింహ బంధము -

— పాదౌ సంపీడ్యయోనౌచ హఠాల్లింగ ప్రవేశనం. 50
శ్లో. హస్తయోఃవేష్టనం గాఢం బంధోనృసింహసంజ్ఞకః—

తా. స్త్రీయొక్క పాదములను నొక్కుచు భగమున హఠాత్తుగ లింగప్రవేశమొనర్చుచు చేతులను గాఢముగాజుట్టి రమించుట నృసింహబంధమగును.

- విపరీత బంధ లక్షణము -

— పాదమేకమురౌ కృత్వా ద్వితీయంకటి సంస్థితం. 51
శ్లో. నారీంచ సురమేత్కామీ విపరీతస్తు బంధకః—

తా, స్త్రీయొక్క పాదము నొకదానిని ఉరముననూ రెండవ పాదము కటిభాగముననూ ఉంచి సంభోగించినయెడల విపరీత బంధ మగును.

- క్షుద్గార బంధము -

— పార్శ్వోపరి పదౌకృత్వా యోనౌలింగేన తాడయేత్. 52
శ్లో. బాహుభ్యాం తాడయేద్గాఢం క్షుద్గారో బంధపవసః—

తా. స్త్రీ కిరుపక్కల పాదములుంచి భగమున లింగతాడన మొనర్చుచు బాహువులచే గాఢముగా తాడనమొనర్చి రమించిన క్షుద్గారబంధమగును.

- ధేనుక బంధము -

— సుప్తాంస్త్రియం సమాలింగ్య స్వయం సుప్తోరమేత్పునః. 53
శ్లో. యల్లింగం చాలయేద్యోనౌ బంధోయంధేనుకః స్మృతః—

తా. వంగియున్న స్త్రీని కౌగిలించుకొని తానుకూడ వంగి యోనియందు లింగసంచలనముఁజేయుచు రమించిన ధేనుక బంధమగును.

- ఉత్కంఠ బంధము -

— నారీపాదౌచ హస్తేన ధారయేద్గళకేపునః. 54
శ్లో. స్తనార్పిత కరో కామీబంధశ్చోత్కంఠ సంజ్ఞకః—

తా. స్త్రీ పాదముల నొకచేత తనకంఠమున కదిమిపెట్టి రెండవచేత స్తనములను గ్రహించి క్రీడించినచో నది యుత్కంఠ బంధ మగును.

- సింహాసన బంధము -

— స్వయం జంఘాద్వయం బాహ్వోకృత్వా యోషిత్పదద్వయం. 55
శ్లో. స్తనౌధృత్వారమేత్కామీ బంధస్సింహాసనోమతః—

తా. స్త్రీయొక్క పిక్కలను పాదములను తన బాహువుల యందుంచుకొని స్తనములను గ్రహించుచు రమించినయెడల సింహాసన బంధమగును.

- నాగ బంధము -

— పీడయే దూరుయుగ్మేన కాముకః కామినీం యది. 56
శ్లో. రతిర్నాగస్సమాఖ్యాతః కామినీనాం మనోహరః—

తా. కాముకుఁడు తన రెండు తొడలచే నాయికను పీడించుచు రమించినయెడల నాగబంధమగును.

